సంపాదకుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంవత్సరం చందా ౨-౦-౦

# ప్రబుద్ధాంధ్ర

సంపుటము ౮ ] రాజమహేంద్రవరము ౧ ఫిబ్రవరి ౧౯౩౭ [ ౧౧ వ సంచిక

## పునర్దర్శనం

చాలా యిబ్బందులవల్ల ప్రబుద్ధాంధ్ర ౧౯౩౬ జూలైలో తాత్కాలికంగా నిలుపుచెయ్యవలసివచ్చింది. కానైతే అప్పణ్ణుంచీ తీవ్ర ప్రయత్నాలే సాగిస్తూ వచ్చాను; కాని యిప్పటివరకూ సాధ్యపడలేదు.

ఈ మాటు మంచి ఆధారం దొరికితే గాని మళ్లీ ప్రకటించకూడదని స్థిరనిశ్చయం చేసుకుని వున్నందున కొంచెం ఆలస్యం అయిపోయింది.

చివరి కిప్పుడు మంచి అసరా దొరికింది. సరస్వతీ పవర్ ప్రెస్ అధిపతులు,

### శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు

ప్రబుద్ధాంధ్ర నిరాటంకప్రచారానికి దృఢమైన చేయూత యిచ్చారు. ఇది మొదలు ప్రబుద్ధాంధ్ర నెల ౧కి ౩౨ పేజీల మేటరుతో వెలువడుతూ వుంటుంది. ఆంధ్రమహాజనుల సాయం ఆపేక్షిస్తూ, మళ్లీ సమధికోత్సాహంతో ఈ సంచిక ప్రకటిస్తున్నాను.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
సంపాదకుడు

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

# ఆధునికాంధ్రవాఙ్మయం

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

### తయారైవున్నవి

| | | |
|---|---|---|
| 1. | గూడుమారిన కొత్తరికం | 0—2—0 |
| 2. | కలంపోటు | 0—2—6 |
| 3. | తల్లిప్రాణం | 0—2—6 |

### అచ్చులోవున్నవి

| | | |
|---|---|---|
| 1. | ఇల్లుపట్టిన వెధవాడబడుచు | 0—4—0 |
| 2. | అన్నంత పనీ జరిగింది | 0—4—0 |

### శాస్త్రిగారి గ్రంథాలు మరికొన్ని

1 రక్షాబంధనం 1-0-0. 2 శ్మశానవాటిక 0-8-0. 3 వారకాంత 0-4-0. 4 విజయనగరరాజుల కథలు 0-2-0. 5 చిత్తూరు రాజుల కథలు 0-3-0.

---

### ఇతరుల గ్రంథాలు

1. మునిమాణిక్యం నరసింహారావుగారివి 1 కాంతం కథలు 1-0-0, 2 నేనూ మాకాంతం 0-4-0, 3 ఉపాధ్యాయుడు 0-8-0, 4 వక్రరేఖ 1-0-0.

2. మొక్కపాటి నరసింహశాస్త్రిగారివి బారిష్టరు పార్వతీశం 1వ భాగం 1-0-0, 2 ప్రతిబింబములు 0-12-0, 3 ఏకోదరులు 0-8-0.

3. రాయప్రోలు సుబ్బారావుగారివి, 1 కవితాంజలి 1-0-0, 2 జడకుచ్చులు 1-0-0.

4. కపిలేశ్వరపురం రాజాగారి పబ్లికేషను చింతలపూడి ఎల్లనార్యుని రాధామాధవము 1-8-0.

5. భమిడిపాటి కామేశ్వరరావుగారివి, 1 అవును 0-8-0, 2 అప్పుడు 0-8-0, 3 ఇప్పుడు 0-8-0, 4 నిజం 0-8-0, 5 కాలక్షేపం 0-8-0.

6. కవితాసమితివారివి, 1 వైశాఖి 1-0-0, 2 ఉత్కళపతనం 0-12-0, 3 ప్రభవ 0-8-0, 4 పూలమాల 0-4-0.

7. టేకుమళ్ల కామేశ్వరరావుగారివి, 1 కోపదారి మొగుడు 0-8-0, 2 జానకీప్రేమ మొదలైన చిన్నకథలు 0-8-0, 3 వాడుకభాష: రచనకి కొన్ని నియమాలు 0-8-0.

8. దేవరాజు వెంకటకృష్ణారావుగారివి, 1 సంజయరాయబారం 1-0-0, 2 శ్రీకృష్ణరాయబారం 1-0-0, 3 కర్ణచరిత్ర 0-10-0 4 శ్రీకృష్ణుడు 0-8-0, కారకాకి 1-0-0.

9. నాళం కృష్ణారావుగారివి, 1 తేనెచినుకులు 0-8-0, 2 పాలతరగలు 0-8-0, 3 గోరుముద్దలు 0-4-0, 4 మాగడతరకలు 0-5-0, 5 వెన్నబుడగలు 0-6-0, 6 గోగీతము 0-2-0, 7 పైడిశేడి 0-2-0, 8 ముద్దు 0-4-0, 9 దీపావళి 0-8-0, 10 విరిదండ 0-8-0.

10. విశ్వనాథ సత్యనారాయణగారివి, 1 వేనరాజు 1-0-0, 2 అనార్కలీ 1-0-0, 3 కిన్నెరసానిపాటలు 1-0-0, 4 ఆంధ్రప్రశస్తి 1-0-0, 5 శృంగారవీధి 1-0-0.

### మరికొన్ని

వేయిస్తంభాలగుడిశాసనం 2-0-0, మల్లికార్జునరావు 0-10-0, రత్నాపణం 0-8-0, రసాంజలి 0-2-0, వసంతము 0-4-0, కవిగారిమనుగడ 0-8-0, విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్ర 1-8-0, మునిమాపు 0-12-0, వకుళమాల 0-12-0, మహామేధావులు 1-0-0, మధ్వాచార్యులవారి చరిత్ర 1-0-0, గీతమాలిక 0-12-0, సోమనాథవిజయం 0-12-0, భాగవతావతరణం 0-8-0. సుందరి 1-0-0, హృదయవిహంగము 0-4-0, నాకాభంగము 0-12-0, ఆంధ్రమహాసామ్రాజ్యము 1-4-0, వనకుసుమాంజలి 1-4-0, ఆంధ్రకావ్యాలంకారసూత్రవృత్తి 1-4-0, ప్రాచీనాంధ్రనాటకీయచారిత్రం 1-0-0, చంద్రగుప్త 1-4-0, పునర్వివాహం 1-0-0, సాహిత్యమీమాంస 1-8-0, జాతకచర్య 2-0-0, గోల్కొండకవుల చరిత్ర 2-0-0, లక్షణనిర్ణయచంద్రిక 1-4-0, సంఘోద్ధరణం 0-8-0, కౌశికి 0-8-0.

కళాభివర్ధనీ పరిషత్తు—రాజమండ్రి




సంపుటము ౮ ] రాజమహేంద్రవరము ౧ ఫిబ్రవరి ౧౯౩౯ [ ౧౧ వ సంచిక

# నిజామురాష్ట్రమూ - మన ఆంధ్రులున్నూ

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

౧

మన మహామహా—పత్రికాసంపాదకుల్లో కొందరికి, నిజాము రాష్ట్రంలో వున్న ఆంధ్రులంటే, ఎప్పుడో వలసపోయి అక్కడ స్థిరపడిపోయినవాళ్లని చాలా దృఢమైన అభిప్రాయం. జనసామాన్యాన్ని దారికి తీసుకురావలసిన సంపాదకుల జ్ఞానమే యీ మెట్టుమీద వున్నప్పుడిక జనసామాన్యం మాటచెప్పడానికేమి వున్నదీ?

అయితే, నిజాము రాష్ట్రం యే ద్వీపాంతరంలోదో కాదు. అది మన ఆంధ్రదేశంలోనే వొక పెద్దభాగం. పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, కర్నూలు, బళ్లారి జిల్లాలకు ఉత్తరపు సరిహద్దే ఆరాష్ట్రం. బెజవాడ పక్కనుంచే అది రాసుకుపోయింది. మన జంగారెడ్డిగూడెం దాటితే ఆరాష్ట్రమే.

మన కింత దగ్గిరగా వుండినా నిజామురాష్ట్రాంధ్రులు మనవాళ్లే అనే జ్ఞానం మన బ్రిటిషుఆంధ్రులకు లేశమూ లేదు.

ఇక్కడ సుఖజీవితావకాశాలు కల్పించుకోలేక, అక్కడికి వెళ్లి పదవులు సంపాదించుకుని వైభవం అనుభవిస్తున్న మనవారెందరో [illegible]రు. అయితే, వారిలో కూడా—అక్కడికి వెళ్లాకకూడా చాలామందికి నిజామాంధ్రులంటే సరియైన అభిప్రాయాలేర్పడలేదు. ఇక్కడ మనవాళ్లను గురించి మిషనరీల భావాలెలా వుంటాయో నిజామాంధ్రులను గురించి అక్కడి మనవారిలో చాలామంది అభిప్రాయాలలా వుంటాయి.

ఇది చాలా అసందర్భాలకు మూలం అవుతున్నది.

ఇదిలా వుండగా—

నిజాము రాష్ట్రంలో వొక్క మన ఆంధ్రులే కాక, ఏమాత్రమో మహారాష్ట్రులూ, కన్నడులూ కూడా వున్నారు; కాని బ్రిటిషిండియాలో వున్న మహారాష్ట్రులూ కన్నడులూ మనలాగ కాక అక్కడి మహారాష్ట్రులనూ, కన్నడులనూ తమకమవారిగానే భావించుకుంటారు. వారిని చాలా గౌరవంగా చూస్తారు. కష్టసుఖాలలో వారిని అనుకుంటారు. వారి కేమయినా రాజకీయపు ఇబ్బందులు కలిగితే తాము హిందూదేశం అంతటా గోల పుట్టించేస్తారు.

వారిని చూసేనా మనవారు ఆసుగుణాలు అలవర్చుకోవడంలేదు.

తమ రక్తంలో రక్తమూ, కండలో కండా, జీవంలో జీవమూ అయిన నిజామాంధ్రులను గురించి యిలాగ అసందర్భంగా ప్రవర్తిస్తూ వుండిన్నీ మన బ్రిటిషుఆంధ్రులు గుజరాతీలా హిందూస్థానీలా శ్రేయస్సును సాధిస్తూ వున్న అఖిలభారత జాతీయత అంటే మాత్రం వుక్కిరిబిక్కిరి అయిపోతూ వుంటారు.

ఇది ఆంధ్రజాతి దౌర్భాగ్యస్థితికి గొప్పనిదర్శనం.

ఈ అజ్ఞానం పోనంతకాలమూ మన గతి అధోగతే.

ఇక నిజాము రాష్ట్రమూ—అందలి ఆంధ్రులూ వున్న స్థితిగతులు చెబుతాను.

మన విజయనగరసామ్రాజ్యం కూలిపోయిన తరవాత తెనుగుదేశం అంతా గోలకొండ నవాబుల చేతిలో పడిపోయింది.

అక్కన్న, మాదన్న, భద్రాచలరామదాసుగార్లతో అవినాభావం గల తానీషాను జయించి డిల్లీచక్రవర్తిఅయిన ఔరంగజేబు ఈరాజ్యం ఆక్రమించుకుని ఇక్కడ అసఫ్ జా అనే వీరుణ్ణి తన సుబేదారుగా నియమించాడు. అయితే చక్రవర్తి చనిపోయిన వెంటనే అసఫ్ జా డిల్లీపాదుషాను ధిక్కరించి స్వతంత్రుడైనాడు.

ఇతనికి నిజాముల్ ముల్కు అని బిరుదు. ఇందులోవున్న నిజాము శబ్దమే తరువాతి హైదరాబాదు నవాబులకు బిరుదయింది.

ఈఅసఫ్‌జా నిజాముల్ ముల్కు ౧౭౪౮ లో చనిపోయాడు. తరవాత అతని సంతతివారు క్రమంగా సలబత్‌జంగు, నిజామలీ ఖాన్, సికందరుజా, నాసిరుద్దౌలా, అఫజలుద్దౌలా, మీర్ మహబూ బలీఖాన్ అనేవారు ఈరాష్ట్రం పాలించారు.

మీర్ మహబూ బలీఖాన్ ప్రభువు ౧౯౧౧ అగష్టు ౨౯ తేదీని చనిపోగా వారి పెద్దకుమారులైన సర్. మీర్. ఉస్మానలీఖాన్ బహద్దరువారు గద్దె యెక్కారు. బిరుదావళితో కలిసి ప్రస్తుత నవాబుగారి పేరు, "లెఫ్టినెంటుజనరల్, హిజ్ ఎక్జాల్టెడ్ హైనస్, అసఫ్‌జా: ముజప్ఫరుల్‌ముల్కు వల్‌ము మాలిక్ నిజాముల్ ముల్కు నిజాముద్దౌలా నవాబ్ సర్. మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహద్దర్ ఫతేజంగ్ ఫెయిత్‌ఫుల్ అలై జి. సి. ఎస్. ఐ., జి. బి. ఇ. నిజాం హైదరాబాదు"

వీరికి ఇవిగాక, ఉర్దూలో "అలాహాజరత్ బందగానేలీ ముతాలీ జిల్లాఫుర్‌మూర్ సుల్తానుల్ ఉలూంఖైసరేదక్కన్" అనిమరి కొన్ని బిరుదులున్నూ వున్నవి.

ఈ సర్. ఉస్మానలీఖాన్ బహద్దరువారి యేలుబడిలో వున్న నిజాము రాష్ట్రం హిందూదేశంలో వున్న స్వదేశసంస్థానాలు అన్నిటికీ పెద్దది మొదటిదీని.

## పెద్దసంస్థానాల వరస

౧. నిజాము రాష్ట్రం (హైద్రాబాదుస్టేటు)
వైశాల్యం ౮౨౬౯౮ చదరపు మైళ్లు.
సాలీనాఆదాయం—౮,౧౭,౬౨,౦౦౦
జనసంఖ్య—౧,౪౪,౩౬,౧౪౮
ఫిరంగులగౌరవం—౨౧

౨. మైసూరు రాష్ట్రం
వైశాల్యం—౨౯౪౭౫ చదరపు మైళ్ళు
సాలీనాఆదాయం—౩,౫౧,౬౧,౮౦౦
జనసంఖ్య—౬౫,౫౭,౮౭౧
ఫిరంగుల గౌరవం—౨౧

౩. కాశ్మీర (జమ్ము) రాష్ట్రం
వైశాల్యం—౮౫,౮౮౫
సాలీనాఆదాయం—౨,౩౦,౫౫,౦౦౦
జనసంఖ్య—౩౬,౪౬,౨౪౩
ఫిరంగులగౌరవం—౨౧

౪. బరోడారాష్ట్రం
వైశాల్యం—౮౧౬౪ చదరపుమైళ్ళు
సాలీనాఆదాయం—౨,౬౦,౧౯,౦౦౦
జనసంఖ్య—౨౪,౪౩,౦౦౭
ఫిరంగులగౌరవం—౨౧

౫. గ్వాలియర్ రాష్ట్రం
వైశాల్యం—౨౬౩౬౭ చదరపుమైళ్ళు
సాలీనాఆదాయం—౨,౪౧,౩౯,౦౦౦
జనసంఖ్య—౩౫,౨౩,౦౭౦
ఫిరంగులగౌరవం—౨౧

౬. తిరువాన్కూరు రాష్ట్రం
వైశాల్యం—౭౬౨౫ చదరపుమైళ్ళు
సాలీనాఆదాయం—౨,౪౧,౩౬,౦౦౦
జనసంఖ్య—౫౦,౯౫,౯౭౩
ఫిరంగులగౌరవం—౧౯

౭. పటియాలారాష్ట్రం
వైశాల్యం—౫౯౪౨ చదరపుమైళ్లు
సాలీనాఆదాయం—౧,౪౫,౦౦,౦౦౦
జనసంఖ్య—౧౬,౨౫,౫౨౦
ఫిరంగులగౌరవం—౧౭

౮. జోద్పూరు రాష్ట్రం
వైశాల్యం—౩౫౦౧౬ చదరపుమైళ్ళు
సాలీనాఆదాయం—౧,౪౦,౧౧,౦౦౦
జనసంఖ్య—౨౧,౨౫,౯౮౨
ఫిరంగులగౌరవం—౧౭

౯. ఇందూరు రాష్ట్రం
వైశాల్యం—౯౯౦౨ చదరపుమైళ్ళు
సాలీనాఆదాయం—౧,౨౪,౨౧,౦౦౦
జనసంఖ్య—౧౩,౨౫,౦౮౯
ఫిరంగులగౌరవం—౧౯

౧౦. బికానేర్ రాష్ట్రం
వైశాల్యం—౨౩౩౧౭ చదరపుమైళ్ళు
సాలీనాఆదాయం—౧,౨౧,౬౬,౦౦౦
జనసంఖ్య—౯,౩౬,౨౧౮
ఫిరంగుల గౌరవం—౧౭

౧౧. జైపూరు రాష్ట్రం
వైశాల్యం—౧౫౫౭౯ చదరపుమైళ్ళు
సాలీనాఆదాయం—౧,౨౦,౦౦,౦౦౦
జనసంఖ్య—౨౬,౩౧,౭౭౫
ఫిరంగులగౌరవం—౧౭

తక్కినసంస్థాలన్నీ ౧ కోటికి లోపు ఆదాయం కలవి.

నిజామురాష్ట్రం భాషా ప్రయుక్తం కాదు. బ్రిటిష్‌ఇండియా రాష్ట్రాలలాగే—ముఖ్యంగా మన చెన్న రాష్ట్రంలాగే అది పంచకోలకపాయమై వున్నది. చెన్నరాష్ట్రంలో ఆంధ్ర, తమిళ, కన్నడ, మళయాళీభాషాభూభాగాలు నాలుగుండగా, మన నిజామురాష్ట్రం

లో ఆంధ్ర మహారాష్ట్ర, కన్నడభాషాభూభాగాలు మూడున్నవి; కాని వ్యవహారంలో మట్టుకి యిది రెండుభాషాభూభాగాలుగా మాత్రమే విభక్తమై వున్నది. అవి,

౧. తెలంగాణా  ౨. మరాట్వాడీ

౪౧, ౫౦౨ చదరపు మైళ్లు  ౪౧, ౧౯౬ చదరపుమైళ్లు

నిజాము రాష్ట్రం మొత్తం వైశాల్యం ౮౨,౬౯౮ చదరపు మైళ్లు. కన్నడభూభాగం మరాట్వాడీలో చేరి వున్నది.

మరాట్వాడీకంటె తెలంగాణా వైశాల్యంలోనూ పెద్దదే; కాని జనసంఖ్యలో చాలా పెద్దది.

మరాట్వాడీలో పర్వతపంక్తు లెక్కువ. వ్యవసాయాని కనువైన చదునుభూములే గాక నీటివసతులు గూడా అక్కడ చాలా తక్కువ. తెలంగాణాలో వున్నట్టు, మేఘాలను ఆకర్షించగలిగే సాంద్రారణ్యాలు కూడా అక్కడలేవు.

స్వాభావికాలైన అలాంటి అసౌకర్యాలు లేకపోవడంవల్ల, తెలంగాణా, తృణకాష్ఠజలసమృద్ధమై వాసయోగ్యమై, తద్వారా జనాకీర్ణమయి వున్నది.

నిజాము రాష్ట్రంలో, సగటున, చదరపు మైలుకి ౧౭౫ మంది జనులు నివసిస్తున్నారు. విడమర్చి చూస్తే, యిది మరాట్వాడీలో ౧౭౦ గానూ, తెలంగాణాలో ౧౮౦ గానూ వుంది.

జిల్లాలన్నిటిలోనూ వైశాల్యంలో వరంగల్లు పెద్దది. అతరాఫ్ బల్దా చిన్నది. జనుల వొత్తిడి ఆదిలాబాదు జిల్లాలో తక్కువ. మెదకుజిల్లాలో హెచ్చు.

జనాభా లెక్కలు తయారుచెయ్యడానికి హైదరాబాదునగరం ప్రత్యేకంగా ఒక జిల్లాగా ఏర్పరచబడినది. దాని వైశాల్యం ౫౩. ౫౭ చదరపు మైళ్లు. ఆనగరంలో చదరపు మైలు ౧ కి ౮౮౯ మంది చొప్పున జనులు నివసిస్తున్నారు.

తెలంగాణా వైశాల్యం ౪౧, ౫౦౨ చదరపు మైళ్లని పైని చూపించి వున్నాను. ఈలెక్కను బట్టి చూస్తే దీని వైశాల్యం మరాట్వాడీవైశాల్యం కంటే ౩౦౬ మైళ్లెక్కువ వున్నది. ఇక జిల్లాలను బట్టి చూస్తే రాష్ట్రం మొత్తం ౧౬ జిల్లాలలోనూ ౮ పైచిలుకు తెనుగు జిల్లాలు. వాటి వివరం.

౧. మహబూబునగరం జిల్లా.

దీనిని పూర్వం పాలమూరుజిల్లా అని వ్యవహరిస్తూ వుండేవారు.

౨. నల్లగొండజిల్లా

౩. కరీం నగరు జిల్లా.

దీనిని పూర్వం ఎల్గందల్ జిల్లా అని వ్యవహరించేవారు.

౪. మెదకుజిల్లా.

౫. నిజామాబాదుజిల్లా.

దీనిని పూర్వం ఇందూరుజిల్లా అని పిలిచేవారు.

౬. అతరాఫ్‌బల్దాజిల్లా.

"బల్దా" అంటే హైదరాబాదునగరానికి మారుపేరు. "అత్రాఫ్" అంటే చుట్టుపట్టులు. హైదరాబాదు చుట్టుపట్టులు ఒక జిల్లాగా ప్రత్యేకించి శ్రీ నిజాంప్రభువు సొంత ఖర్చులనిమిత్తం ప్రత్యేకించి వారి కిచ్చివేసినారు. దీనివల్ల సాలీనా ౫౦ లక్షల రూపాయల ఆదాయం వస్తున్నది. ఇదిగాక ప్రభువు ఖర్చులనిమిత్తం రాష్ట్రాదాయంలోనుంచి మరో ౫౦ లక్షల రూపాయలు కూడా సాలీనా యిస్తున్నారు.

౭. వరంగల్లు. (ఓరుగల్లు) జిల్లా.

౮. బాగాల్ జిల్లా.

పదిపన్నెం డేళ్లకిందట యిది కొత్తగా సృష్టించబడ్డది.

౯. ఆదిల్లాబాదుజిల్లా.

ఈ జిల్లాలో మొత్తం తాలూకాలు ౧౦. అందులో నాలు గైదు తెనుగు తాలూకాలు.

ఇవి కాక, రాయచూరు జిల్లాలోని అలంపూరు తాలూకాయు న్ను, గుల్బర్గాజిల్లాలోని "కోడంగల్" తాలూకాయున్ను పూర్తిగా తెనుగుతాలూకాలు.

ఇవి కాక, యీ రాష్ట్రంలో యీ కింది సంస్థానాలు తెనుగు వారివి.

౧. గద్వాల.

రాయచూరుజిల్లాలో వున్నది. సాలీనా ఆదాయం.

| | |
|---|---|
| | ౩,౭౯,౨౪౭ రూపాయలు. |
| ౨. వనపర్తి | ౫,౩౪,౧౨౯ రూపాయలు. |
| ౩. ఆత్మకూరు | ౩,౩౦,౩౦౧ రూపాయలు. |
| ౪. గోపాలపేట | ౭౩,౪౭౭ రూపాయలు. |
| ౫. జటప్రోలు | ౧,౪౭,౨౨౫ రూపాయలు. |

ఇవి నాలుగూ మహబూబునగరం జిల్లాలోవి.

| | |
|---|---|
| ౬. దోమకొండ | ౭౭,౩౩౦ రూపాయలు. |
| ౭. సిర్నపల్లి | ౪౧,౦౦౫ రూపాయలు. |

ఇవి రెండూ నిజామాబాదుజిల్లాలోవి.

| | |
|---|---|
| ౮. పాపన్నపేట | ౫౩,౦౭౫ రూపాయలు. |

ఇది మెదకుజిల్లాలోది.

అనేకసంస్థానాలవారు తమకు వచ్చే భూమిపన్ను మాత్రమే చూపించారు. అబ్కారీ, అడవులు, మొదలైన వాటివల్ల వచ్చే ఆదాయం చూపించలేదు. అందేత ఈ తెనుగు సంస్థానాల ఆదాయం తక్కువగా కనబడుతున్నది కాని యివి పెద్దవాటిలోనే చేరి వున్నవి.

నిజాంరాష్ట్రంలో వున్న సంస్థానాలలో ౧ లక్షకు పైబడిన ఆదాయం గల సంస్థానాలవారికి సివిల్, క్రిమినల్ అధికారాలున్నవి.

మొత్తం నిజాంరాష్ట్రంలో వున్న జాగీర్లు—అంటే సంస్థానాలు ౧౧౬౭.

వాటి వివరాలు

| సాలీనాఆదాయం | | | | హిందువులవి | ముస్లిములవి |
|---|---|---|---|---|---|
| రు | ౧౦ మొదలు | ౫౦ వరకు | | ౧౦౦ | ౪౨ |
| | ౫౦ ,, | ౧౦౦ ,, | | ౧౦౯ | ౪౨ |
| | ౧౦౦ ,, | ౩౦౦ ,, | | ౨౪౧ | ౧౬౧ |
| | ౩౦౦ ,, | ౫౦౦ ,, | | ౬౫ | ౭౨ |
| | ౫౦౦ ,, | ౬౦౦ ,, | | ౨౫ | ౨౨ |
| | ౬౦౦౦ ,, | ౧౦౦౦౦ ,, | | ౨౯ | ౭౨ |
| | ౧౦౦౦౦ ,, | ౧౨౦౦౦ ,, | | ౧౦ | ౨౩ |
| | ౧౨౦౦౦ ,, | ౧౫౦౦౦ ,, | | ౨౦ | ౨౪ |
| | ౧౫౦౦౦ ,, | ౫౦౦౦౦ ,, | | ౨౦ | ౫౯ |
| | ౫౦౦౦౦ ,, | ౧ లక్ష ,, | | ౬ | ౫ |
| | ౧ లక్షపైని వచ్చేవి | | | ౭ | ౧౨ |

ఒక సంస్థానం ఆదాయం ౧౨౦౦౦. అది యీ పృథక్కులాలు అటూ సంబంధించనివారిది.

## జ న సం ఖ్య

ఈ వ్యాసంలో చూపించబడ్డ జనసంఖ్య అంతా ౧౯౩౧ జనాభా లెక్కల ననుసరించి చూపబడ్డది.

వెనకచూపిన సంస్థానాల వివరాలనుబట్టి స్వదేశ సంస్థానా లన్నిటిలోనూ నిజాము రాష్ట్రం పెద్దది; కాని బ్రిటిషిండియా రాష్ట్రాల కన్నిటికీ అది చిన్నది. వాటివివరాలు:

| రాష్ట్రం | మొత్తం జనసంఖ్య |
|---|---|
| ౧ హిందూదేశం | ౩౫,౨౮,౩౭,౭౭౮ |
| ౨ బెంగాలు | ౫,౦౧,౧౪,౦౦౨ |
| ౩ సంయుక్తపరగణాలు | ౪,౮౪,౦౮,౭౬౩ |
| ౪ మద్రాసు | ౪,౬౭,౪౦,౧౦౭ |
| ౫ బీహారు–ఒరిస్సా | ౩,౭౬,౬౭,౧౪౬ |
| ౬ పంజాబు | ౨,౩౫,౮౦,౮౫౨ |
| ౭ బొంబాయి | ౨,౧౯,౩౦,౬౦౧ |
| ౮ మధ్యపరగణాలు–బేరారు | ౧,౫౫,౦౭,౭౨౩ |
| ౯ నిజాము రాష్ట్రం | ౧,౪౪,౩౬,౧౪౮ |

మతముల ననుసరించి నిజాంరాష్ట్ర వివరాలు

౧. హిందువులు

| | | |
|---|---|---|
| సవర్ణులు | ౯౬,౯౯,౬౧౫ | మొత్తం ౧,౨౧,౭౬,౭౨౭ |
| అవర్ణులు | ౨౪,౭౩,౨౩౦ | |
| ఆర్యసామాజికులు | ౩,౭౦౦ | |
| బ్రహ్మసామాజికులు | ౧౮౨ | |

| | |
|---|---|
| ౨. మస్లిములు | ౧౫,౩౪,౬౬౬ |
| ౩. అడవిజాతులు | ౫,౪౪,౭౮౯ |
| ౪. క్రిస్టియనులు | ౧,౫౧,౩౮౨ |
| ౫. జైనులు | ౨౧,౫౪౩ |
| ౬. సిక్కులు | ౫,౧౭౮ |
| ౭. పార్శీలు | ౧,౭౮౪ |
| ౮. బౌద్ధులు | ౫౨ |
| ౯. యూదులు | ౨౭ |

భాషల ననుసరించి నిజాంరాష్ట్ర జనసంఖ్య

| భాష. | జనసంఖ్య. |
|---|---|
| ౧. తెనుగుమాట్లాడేవారు | ౬౯,౭౨,౫౩౪ |
| ౨. మహారాష్ట్రం | ౩౭,౮౬,౮౩౮ |
| ౩. కన్నడం | ౧౬,౨౦,౦౯౪ |
| ౪. ఉరుదు | ౧౫,౦౭,౨౭౨ |
| ౫. లంబాడీ (బంజార్కీ) | ౨,౧౪,౬౧౭ |
| ౬. గొండీ | ౭౬,౦౮౭ |
| ౭. రాజస్థానీ | ౫౬,౨౫౧ |
| ౮. గుజరాతీ | ౩౩,౯౧౫ |
| ౯. మురకల | ౩౧,౯౭౪ |
| ౧౦. అరవము | ౨౯,౦౫౦ |
| ౧౧. ఇంగ్లీషు | ౧౭,౮౧౯ |
| ౧౨. భిల్లీ | ౯,౬౧౯ |
| ౧౩. పార్శీ | ౬,౬౫౯ |
| ౧౪. పంజాబీ | ౪,౫౬౦ |
| ౧౫. అరబ్బీ | ౩,౧౭౨ |
| ౧౬. ఇతరాలు | ౬౯,౬౮౭ |

ఇలాగ నిజాంరాష్ట్రంలో ఒక్క తెనుగువారు ౭౦ లక్ష లుండగా తక్కిన ౧౫ భాషలవారూ కలిసి ౭౪ లక్ష లున్నారు. దీనిని బట్టి నిజాంరాష్ట్రంలో ప్రధానదేశభాష తెనుగు అని స్పష్ట పడుతున్నది.

## రా జ ధా ని

ఇక రాజధాని విషయం. నిజాంరాష్ట్రరాజధాని హైదరాబాదునగరం. దీని వైశాల్యం ౫౩.౫౭ చదరపుమైళ్ళు.

బ్రిటిషు ఆంధ్రరాష్ట్రంలో పెద్దనగరా లెన్నో వున్నవి, కాని ౭౦ వేలకు పైబడిన సంఖ్య కలది వొక్కటీ లేదు. మన కీలోటు తీర్చేది వొక్క హైదరాబాదు నగరం మాత్రమే కనపడు తున్నది. దీని జనసంఖ్య ౪,౬౬,౮౯౪.

దీన్ని బట్టి చూస్తే ఆంధ్రదేశాని కంతకీ యీనగరం మొదటిది. హిందూదేశానికి నాల్గోది. బ్రిటిషుసామ్రాజ్యాని కారోది. ప్రపంచానికి యిరవై మూడోది. ౧౯౨౧ లో దీని వైశాల్యం ౫౦.౯౮ చదరపుమైళ్లు మాత్రమే వుండేది. అప్పుడు జనసంఖ్య ౪,౦౪,౧౮౭ మాత్రమే వుండేది.

హైదరాబాదు జనసంఖ్య వివరాలు

మతముల ప్రకారం

| | |
|---|---|
| ౧. హిందువులు | ౨,౫౨,౫౭౭ |
| ౨. ముస్లిములు | ౧,౯౨,౩౪౩ |
| ౩. క్రిష్టియనులు | ౧౬,౧౨౩ |
| ౪. ఆదివిజాతులవారు | ౩,౩౮౧ |
| ౫. పార్సీలు | ౧,౦౯౨ |
| ౬. సిక్కులు | ౧,౦౧౨ |
| ౭. జైనులు | ౩౧౨ |
| ౮. యూదులు | ౨౭ |
| ౯. చిల్లరజాతులవారు | ౩.. |

హైదరాబాదు మొత్తం జనసంఖ్య ౪,౬౬,౮౯౪ లోను మన తెనుగువారు ౧,౭౩,౩౫౭. అంటే మూడు భాగాల్లో ఒక భాగం కంటే హెచ్చు.

తెనుగు మాట్లాడేవారు మొత్తం ౧౭ జిల్లాలలోను వ్యాపించి వున్నారు; గాని ఒక్క తెలంగాణాలో మాత్రమే లేరు.

జిల్లాలలో తెనుగువారు.

| జిల్లా. | మొత్తం జనసంఖ్య. | తెనుగువారు. |
|---|---|---|
| ౧. హైదరాబాదు | ౪,౬౬,౮౯౪ | ౧,౭౩,౫౭౭ |
| ౨. అతరాఫ్‌బల్దా | ౪,౯౯,౬౬౧ | ౩,౯౭,౬౧౨ |
| ౩. వరంగల్లు | ౧౧,౧౭,౬౯౩ | ౯,౪౯,౪౮౮ |
| ౪. కరీంనగరం | ౧౨,౪౧,౪౦౫ | ౧౧,౬౮,౦౬౨ |
| ౫. ఆదిలాబాదు | ౭,౬౨,౦౩౦ | ౪,౬౩,౫౫౮ |
| ౬. మెదకు | ౭,౩౮,౬౬౫ | ౬,౩౯,౩౫౦ |
| ౭. నిజామాబాదు | ౬,౨౩,౨౨౫ | ౫,౪౫,౧౮౮ |
| ౮. మహబూబునగరం | ౯,౭౧,౬౧౬ | ౮,౨౧,౯౦౨ |
| ౯. నల్లగొండ | ౧౧,౩౩,౪౦౯ | ౧౦,౨౯,౫౦౬ |
| ౧౦. ఔరంగాబాదు | ౯,౪౪,౭౯౩ | ౧౬,౪౫౨ |
| ౧౧. బీదు | ౬,౩౩,౬౯౦ | ౪,౬౦౯ |
| ౧౨. నాందేడు | ౭,౨౨,౦౮౧ | ౧,౨౦,౪౭౭ |
| ౧౩. పర్భని | ౮,౫౩,౭౬౦ | ౧౩,౮౫౦ |
| ౧౪. గుల్బర్గా | ౧౨,౨౫,౦౦౮ | ౨,౩౯,౭౯౬ |
| ౧౫. ఉస్మానాబాదు | ౬,౯౧,౦౬౮ | ౧౭,౯౯౪ |
| ౧౬. రాయచూరు | ౯,౩౭,౫౩౫ | ౨,౩౭,౫౫౩ |
| ౧౭. బీదరు | ౮,౭౩,౬౧౫ | ౧,౩౩,౭౮౦ |

పాఠకుల ఉపయోగం కోసం బ్రిటిషు ఆంధ్రుల సంఖ్యలు కూడా యీక్రింద జిల్లాలవారీగా చూపుతున్నాను.

మద్రాసు ప్రెసిడెన్సీలో

| జిల్లా. | మొత్తం జనసంఖ్య. | తెనుగువారు. |
|---|---|---|
| ౧. గంజాం | ౨౪,౧౧,౬౧౯ | ౮,౯౭,౩౭౮ |
| ౨. విశాఖపట్నం | ౩౬,౦౭,౯౪౮ | ౨౫,౦౯,౫౩౫ |
| ౩. తూర్పుగోదావరి | ౧౯,౨౦,౫౮౨ | ౧౮,౩౩,౧౦౯ |
| ౪. పశ్చిమగోదావరి | ౧౨,౨౩,౦౫౬ | ౧౧,౯౫,౨౯౬ |
| ౫. కృష్ణా | ౧౨,౫౪,౨౦౮ | ౧౧,౮౪,౨౪౬ |
| ౬. గుంటూరు | ౨౦,౩౫,౬౬౦ | ౧౮,౭౭,౧౪౪ |
| ౭. నెల్లూరు | ౧౪,౮౬,౨౨౨ | ౧౩,౬౩,౫౭౮ |
| ౮. కడప | ౯,౪౯,౩౯౩ | ౮,౩౬,౧౨౪ |
| ౯. కర్నూలు | ౧౦,౨౪,౯౩౧ | ౮,౭౪,౮౭౮ |
| ౧౦. బళ్ళారి | ౯,౬౯,౭౭౪ | ౩,౦౫,౭౭౫ |
| ౧౧. అనంతపురం | ౧౦,౫౦,౪౧౧ | ౮,౩౭,౨౬౭ |
| ౧౨. మద్రాసు | ౬,౪౭,౨౩౦ | ౧,౨౪,౬౪౯ |
| ౧౩. చెంగల్పట్టు | | ౩,౧౯,౯౪౬ |
| ౧౪. చిత్తూరు | | ౧౦,౬౨,౫౨౯ |
| ౧౫. ఉత్తరఆర్కాటు | | ౩,౧౭,౭౬౫ |
| ౧౬. సేలం | | ౪,౧౬,౨౨౪ |
| ౧౭. కోయంబత్తూరు | | ౫,౨౯,౬౪౦ |
| ౧౮. దక్షిణఆర్కాటు | | ౧,౮౪,౩౩౪ |
| ౧౯. తంజావూరు | | ౬౮,౪౨౯ |
| ౨౦. తిరుచునాపల్లి | | ౨,౧౫,౪౬౦ |
| ౨౧. మధుర | | ౩,౮౩,౬౮౯ |
| ౨౨. రామ్నాడు | | ౧,౯౭,౦౧౯ |
| ౨౩. తిరునల్వేలి | | ౧,౭౬,౯౬౦ |
| ౨౪. నీలగిరి | | ౯,౪౮౨ |
| ౨౫. మలబారు | | ౧౬,౩౩౦ |
| ౨౬. దక్షిణకనరా | | ౧,౦౨౫ |
| ౨౭. పుదుకోట్టస్టేటు | | ౧౨,౨౫౦ |
| ౨౮. బంగనపల్లిస్టేటు | | ౭౦,౩౫౨ |
| ౨౯. సాండూరుస్టేటు | | ౨,౪౮౫ |
| మద్రాసుప్రెసిడెన్సీ మొత్తంమీద ఆంధ్రులు | | ౧,౭౭,౩౮,౦౨౪ |

ఇందులో మద్రాసు అంకెలు తప్పని బలమైన ప్రవాదం వున్నది. గతజనాభాకాలంలో ఆంధ్రేతర్లు మద్రాసులో ఆంధ్రుల సంఖ్యను ప్రయత్నం పూర్వకంగా తగ్గించి చూపించారనడానికి బలమైన అనుమానా లున్నవి.

ఈఅంకెలే స్థిర మయినా మొత్తం ప్రెసిడెన్సీలో మన ఆంధ్రులు సగం కంటే తక్కువా, మూడోవంతు కంటే యెక్కువా వున్నారు. ఇక హిందూదేశం మొత్తంమీద మన ఆంధ్రులు—

| | |
|---|---|
| ౧. మద్రాసుప్రెసిడెన్సీ | ౧,౭౭,౩౮,౦౨౪ |
| ౨. నిజామురాష్ట్రం | ౬౯,౭౨,౫౩౪ |
| ౩. మైసూరురాష్ట్రం | ౧౦,౩౦,౯౫౬ |
| ౪. బర్మా | ౧,౬౦,౬౪౦ |
| ౫. బొంబాయి | ౧,౪౯,౮౦౭ |
| ౬. మధ్యరాష్ట్రాలు—బీరారు | ౧,౩౦,౭౯౩ |

| | | |
|---|---|---|
| ౭. మద్రాసు స్టేట్సు ఏజన్సీ | ౬౭,౦౮౪ |
| ౮. బెంగాలు | ౩౧,౨౦౬ |
| ౯. అస్సాము | ౩౦,౭౭౬ |
| ౧౦. బీహారు-ఒరిస్సా | ౨౨,౧౦౭ |
| ౧౧. బొంబాయిస్టేట్సు | ౧,౨౯౭౭ |
| ౧౨. మధ్యరాష్ట్రీలస్టేట్సు | ౧,౨౦౩౭ |
| ౧౩. బీహారు-ఒరిస్సాస్టేట్సు | ౭,౪౦౫ |
| ౧౪. కూర్గు | ౨,౬౬౮ |
| ౧౫. బెంగాలుస్టేట్సు | ౧,౯౧౯ |
| ౧౬. సెంట్రల్ ఇండియా ఏజన్సీ | ౮౪౭ |
| ౧౭. ఆగ్రా - అయోధ్యపరగణాలు | ౬౪౦ |
| ౧౮. అండమానునికోబార్సు | ౪౩౫ |
| ౧౯. బరోడాస్టేటు | ౩౬౨ |
| ౨౦. పశ్చిమోత్తరపరగణాలు | ౧౫౮ |
| ౨౧. ఢిల్లీ | ౧౨౬ |
| ౨౨. పంజాబు | ౧౨౪ |
| ౨౩. అజ్మీరు - మీర్వారా | ౧౧౪ |
| ౨౪. రాజపుతానా ఏజన్సీ | ౧౦౭ |
| ౨౫. పశ్చిమోత్తరపరగణాల ఏజన్సీ | ౧౦౬ |
| ౨౬. ఈస్టరన్ ఇండియాస్టేట్సు ఏజన్సీ | ౭౭ |
| ౨౭. గ్వాలియర్ స్టేటు | ౭౦ |
| ౨౮. బలూచిస్థాన్ | ౪౨ |
| ౨౯. అస్సాంస్టేట్సు | ౧౦ |
| ౩౦. జమ్ముకాశ్మీరంస్టేట్సు | ౬ |
| హిందూదేశం మొత్తంమీద ఆంధ్రులు | ౨,౬౩,౭౩,౭౨౭ |

ఇందులో బర్మా ఆంధ్రుల సంఖ్యమాత్రం చూపించబడ్డది. ఇంగ్లాండు, ఫ్రాన్సు, నేటాలు వగైరా దూరదేశాలలోనే కాక సింహళం, అఫ్ఘనిస్తాన్, జపాన్, చీనా మొదలైన సరిహద్దు ప్రదేశాల్లో కూడా మన ఆంధ్రు లెందరో వున్నారు. వారి సంఖ్యలు ప్రస్తుతం లభించలేదు. అవి మరోమాటు ప్రకటిస్తాను.

ఈనిజాంరాష్ట్రంలోకి ఇతరప్రదేశాలవా ళ్ళనేకులు వచ్చి చేరు తున్నారు. ఇక్కడనుండి యితరప్రదేశాలకున్నూ కొందరు వెళ్తు తున్నారు.

ఆ వివరం.

| ఇతరప్రదేశాల | నుండి వచ్చినవారు | కు వెళ్ళినవారు |
|---|---|---|
| ౧. మద్రాసుప్రెసిడెన్సీ | ౧,౩౨,౯౫౨ | ౫౮,౪౭౬ |
| ౨. బొంబాయిప్రెసిడెన్సీ | ౬౮,౦౫౮ | ౧,౭౦,౦౭౬ |
| ౩. మధ్యపరగణాలు - బీరారు | ౧౪,౨౮౯ | ౯౧,౦౬౫ |
| ౪. సంయుక్తపరగణాలు | ౮౦౩౮ | ౩,౭౫౨ |
| ౫. రాజపుత్రస్థానం | ౬,౬౦౮ | ౨౦౦ |
| ౬. పంజాబు | ౩,౩౩౧ | ౭౯౭ |
| ౭. మైసూరు | ౨,౮౬౯ | ౪,౨౨౪ |
| ౮. అజమీరు - మేర్వారా | ౧,౫౨౫ | ౪౫౦ |

మనుష్యుల సగటుజీవితం.

| | పురుషులు (సంవత్సరాలు) | స్త్రీలు (సంవత్సరాలు) |
|---|---|---|
| తెలంగానాలో | ౨౪.౨ | ౨౩.౩ |
| మరాట్వాడీలో | ౨౪.౨ | ౨౩.౭ |
| మతాల ననుసరించి చూస్తే | | |
| మస్లిములలో | ౨౬.౪ | ౨౫.౯ |
| హిందువులలో | ౨౬.౦ | ౨౫.౮ |
| క్రిస్టియనులలో | ౨౫.౭ | ౨౩.౮ |
| జెయినులలో | ౨౬.౩ | ౨౬.౩ |
| ఆదివిజాతులలో | ౨౪.౦ | ౨౩.౦ |

దీన్నిబట్టి చూస్తే జీవితపరిమితి మస్లిము పురుషులలోనూ, జెయిన స్త్రీలలోనూ యెక్కువగా కనబడుతున్నది.

నిజాం రాష్ట్రంలో అనేకమతా లున్నవి. అన్నిటిలోనూ హిందూమతం సంఖ్య పెద్దది కాని దినదినమూ యిది తరిగిపోతున్నది. పెరుగుతున్న మతాలలో ఇస్లాం మతమూ, క్రిష్టియనుమతమూ ప్రధాన మైనవి. వీటిలో కలిసిపోతూ వున్నవా రంతా హిందువులే. ఆహిందువులలోనూ కూడా ఇతరమతాలలో చేరేవారిలో ఆంధ్రు లెక్కువ. దీనికి కారణం ఆంధ్రులలో అగ్రజాతులలో కూడా ఆత్మప్రత్యయమూ, ఆత్మగౌరవమూ తక్కువగా వుండడమే. ఈస్థితి ఒక్క నిజామాంధ్రులలోనే కాను, మొత్తం ఆంధ్రజాతిలోనే వున్నది.

వేషంలో, భాషలో, మతంలో, చివరకి తిండిలో కూడా ఇతరుల ననుకరించేవారిలో ఆంధ్రులను ఎవరూ పోటీచెయ్యలేరు.

ఆంధ్రుల అన్యమతప్రవేశానికి బ్రిటిషిండియాలో వుండే కారణాలకంటే నిజాంరాష్ట్రంలో వుండే కారణాలు ఎక్కువా బల మైనవీ కూడానూ.

ఇది చూస్తే మనవారి అసందర్భస్థితి తెలుస్తుంది.

ఆరాష్ట్రంలో నగరాలలో జట్కావాళ్లలో చాలామంది తెనుగుపంచములు. పల్లెలనుంచి వచ్చే అగ్రజాతులవారు వారి బళ్లెక్కరు. తాము క్రిష్టియనుల మని చెప్పుకున్నా అబళ్లవాళ్లకు లాభం లేదు. అందుచేత వారిలోచాలామంది తురకవేషం వేస్తారు. "మేము తురకలం" అని చెప్పుకుంటారు. ఈసందర్భం క్రమంగా వారిని అన్యమతప్రవేశానికి ప్రోత్సహిస్తున్నది.

ఇలాంటి విషయా లెన్నో వున్నవి. వచ్చే సంచికలో రెండో వ్యాసంలో మరికొన్ని వివరా లిస్తాను.

# సాహిత్యాస్వాదము

జమ్ములమడక మాధవరామశర్మ

సాహిత్యముమీద లోకసామాన్యానికి సాధారణ దృష్టి ఉన్నది. ఇట్లా ఆపాతమాత్రంగా చూచే రకానికి సాహిత్యనిజస్వరూపం తెలియదు. గేయాలు పద్యాలు పాటలు కథలు ఇంతమాత్రమే సాహిత్యమని అనుకునేవాళ్లు స్వరూపసత్తకు లోటు సంపాదించుకుంటున్నారు. విశిష్టవిభ్రాజి అయిన సాహిత్యము వెలువరించిన విశ్వగీతిలో జడాజడవర్గ మంతా కరగి తత్ప్రవణం అయిపోతుంది. సాహిత్యమును ఆస్వాదింపగలుగుతున్నాము. అని తలచేవారు సాహిత్యానికి అపకారం చేస్తున్నారు. సాహిత్యమును అనుభవింపవలసిన పద్ధతిలో అనుభవించగలిగేవాడు సహృదయుడు. పుస్తకమును చేత ధరించినవారంతా సహృదయులు కారు. కాగితము కలము పట్టినమాత్రాన కవి కాడు. రంగుమాత్రాన నటుడు కాడు. నాటకములను చూచే అన్నితరగతులవారూ ఆస్వాదయితలే అని అంగీకరించలేను. మంచి కవి అనే పదంతో పిలువదగినవాళ్లు ఒకడో యిద్దరో మూడవ వ్యక్తి దుర్లభము అని రాజశేఖరు డన్నట్లు సహృదయపదవ్యవహార్యులు కూడా అంతే. సహృదయుడు, భావకుడు, రసికుడు, మొదలయినవి పర్యాయపదాలు. ఇంద్రుడు, పురందరుడు, శక్రుడు అనే ఇంద్రవాచక పర్యాయపదాలలో ప్రవృత్తినిమిత్తమును పరిశీలించి పదకారులు చెప్పారు. అట్లాగే పైపదాలలో వైయాకరణదృష్టికి ప్రవృత్తినిమిత్తము వేరువేరుగా కనబడుతుంది. కాని అటువంటి అనంతపర్యాయపదాలలో కూడా ప్రవృత్తినిమిత్తం ఒకటే. స్వరూప సంపత్తిని ప్రవృత్తి నిమిత్తముగా గ్రహించితే సహృదయస్వభావం తెలుస్తుంది.

అల్లుడు లేకపోతే కన్యకకు రాణింపు లేదు. సహృదయుడు లేకపోతే సాహిత్యము ప్రకాశించదు. సహృదయమ్మన్యుల సన్నిధానంలోని సాహిత్యము స్వరూపచ్యుత మవుతుంది. సహృదయత్వము ఒకని సొత్తు కాదు. ఎన్ని శాస్త్రాలు చదివినా సహృదయత్వం కలుగకపోవచ్చు. మాకు సహృదయత్వం ఉన్న దని అహంతో అభాంధసులు ప్రవర్తించితే సాహిత్యసౌందర్యము కవితాసామగ్రిలో కలిసినట్లే. రమణీయ రమణీరామణీయతను అవగాహనం చేసుకోగలిగిన అనుభవరసికుడు ఆస్వాదింపగలడు. కేవలం కన్నెను ఆవేశించిన పెనుభూతము తన అనుభవంలో ఆస్వాదమును తెలుసుకోగలుగునా ?

సహృదయుడు విశిష్టభోక్త. సాహిత్యములోని ప్రత్యేకాంశములలో అంతటా అతడు నిగూహితమైన సౌందర్యమునే అన్వేషించుతాడు. కవితాసామగ్రి అనేకరూపంగా ఉంటుంది: ఒక్కొక్క సామగ్రిలో ఒక్కొక్క విజాతీయసౌందర్యమును సహృదయుడు భావించుతాడు. సౌందర్యమును మొదట వేరువేరుగా భావించినప్పటికీ, స్వసంవేదనములో కదించుకొన్నప్పుడు సామరస్యమును సంపాదింపగలుగు ధీరుడు సహృదయుడే. సహృదయుని దృష్టిలో అసుందరము భాసింపదు. అటువంటి పదార్థానికి అతని రసమయహృదయంలో అవకాశము లేదు. అహం జ్ఞానముద్రాముద్రితుడే సహృదయు డవుతాడు. ఈఅహంతా ప్రజ్ఞాశాలి అయిన సహృదయుడు భావనాపంచకములో పరిశ్రుడవుతాడు. సౌందర్యముకన్న వేరుగా మొదట సాహితీసామగ్రి గోచరించుట సాహితీసామగ్రిలో సౌందర్యము గోచరించుట, సాహితీసామగ్రి సౌందర్యసంబంధముకలదిగా భాసించుట, ఆ సామగ్రి సౌందర్యరూపరంజితమై గోచరించుట, అఖండసౌందర్యము స్వరూపసంవేదనాత్మకముగా ప్రకాశించుట, అను ఆయైదు భావనలు సహృదయునకు ప్రపంచము: ఈప్రపంచవిహారి అహంతా విలాసి.

సహృదయుడు, సుహృదయుడు. ఈతడి హృదయము కావ్యామృతములచేత ప్రమదిమ పొంది ఉంటుంది. ఇట్టి హృదయశోభనత అర్హతను సంపాదించుకుంది. ఈతడు హృదయసహితుడు. సాహితీరసాస్వాదనకు హృదయము కావాలి. ఎడతెగని ఊపిరాడని అనంతసంకల్పవికల్పదూషితమైన మనస్సునకు ఇక్కడ అవకాశం లేదు. హృదయశబ్దానికి వేదాంతులు చెప్పే అర్థం గ్రహించాలి. హృత్ + అయం = హృదయం. స్వసంవేదన ప్రకాశానుకూలమైన స్థానము హృదయము. ఇటువంటి హృదయము కలవాడు, ఈవిధముగా అయినవాడు, సహృదయుడు. ఏఅధీతి ఈవిధముగా అయినా సరే సహృదయుడే. “కావ్యానుశీలనాభ్యాసమువలన మనోముకురమును విశదముగా చేసుకొన్నవాడే సహృదయుడు. కవి వర్ణించే విషయంలో తన్మయీభవనయోగ్యతను సంపాదించి సహృదయసంవాదమును పొందగలిగినవాడైతేనే సహృదయపదవాచ్యుడు. హృదయానికి తాదాత్మ్యాన్ని సంపాదించితే అంతటా ఏకవిధంగా భాసించుతుంది. అపుడు సంవాదకాంతరావసరము లేకుండగనే కావ్యార్థమును స్వహృదయసంవాదంతో సహృదయుడు భావించుతాడు. తత్త్వావధారణనిపుణులు విశుద్ధమానసులు ప్రశస్తహృదయులే సహృదయులు. సత్కవివర్ణనసముపారూఢరూపములు గల విభావాదులను నిర్మలమణిముకురవిశదహృదయసీమలో సమున్మిషింపచేసుకొంటేనే సహృదయుడు. రత్యాదిభావబంధురుడే కావ్యానుశీలనము చేస్తాడు. కేవలశ్రోత్రియులకు సహృదయత్వం రాదు. కేవలము కవి రచించినంతమాత్రాన కావ్యానికి కావ్యత్వం రాదు. సహృదయాస్వాదనలో అది విషయం కావాలి. అందువల్లనే ఏపూట కాపూట కర్తృత్వబుద్ధితో కావ్యరచన చేసి, సహృదయత్వబుద్ధితో తన సూక్తిముద్రావిచారణము చేయాలి అని అలంకారతంత్రసంప్రదాయము. సకలజగత్తునకు అలౌకికత్వోన్మీలనమును సంపాదించి ప్రతిక్షణము విశ్వవైచిత్ర్యాన్ని ఆస్వాదింపచేస్తూ అలౌకికవస్తువర్ణనానిపుణమైన ప్రతిభతో కూడుకొన్న కవి పరినిష్ఠితార్థవిషయాత్మ్యగము

కల విపశ్చిద్దృష్టిని కూడా సంపాదించాలి. అప్పుడే పరిణతబుద్ధి అవుతాడు. ఈ పరిణతబుద్ధిమత్తయే సహృదయత.

సాహిత్యమును అనేకముఖాల ఆస్వాదింపవచ్చు. సాహితీ సామగ్రి బహువిధముల ఉంటుంది. కాబట్టి తత్తదాస్వాదము మొదట వివిధముగానే ఉండవచ్చు. అయినా సహృదయుడు అవిష్టహృదయుడు. అతని అంతరంగము రస్యమానతాధర్మములను పొదువుకొన్నది. సాహితీతేజఃకణాల కదలికలలోని తళుకుదనములకు అతని హృదయపీఠిక ఆకరము. సుషుప్తిలో మాదిరి నిమ్నోన్నతముల గుర్తింపచేయని సమభావన నిర్విశేషముగా అసహృదయుని అంతరంగములో రసవాహినియై ప్రసరించుతుంది. అతడా సమయములో ఒక హృదయవ్యాప్తినే అనుభవించడు. సర్వాంగీణానందము అతనికి స్ఫురించుతుంది. సత్యపథమును అతిక్రమింపని తత్త్వము అరసయితకు సుసంవేదము. అతడు సాత్త్వికసాత్త్వికుడు. విరుద్ధధర్మములందు విశిష్టతేజమును ప్రజ్ఞాచక్షువుతో పరిశీలింపగలడు. అతని స్థితప్రజ్ఞస్వభావత, శాంతచిత్తతను సంపాదించి మహావిమర్శను అవగాహపరుస్తూ అఖండాస్వాదభూమికలో ముంచెత్తుతుంది. అతనికి చర్వణాసమయంలో వైవిధ్యమును సంపాదించిన విశేషములు భాసింపవు. సహృదయునికి భావన ప్రధానము. ఆభావన దీర్ఘదీర్ఘము. అది అనాదినిధనము. ప్రాక్తనసంస్కారానుగతము. ధారావాహికము. రసమాత్రానుస్యూతము. భావకుని హృదయం రసమయము.

ఇటువంటి రసయితను కవి సంపాదించాలి. కావ్యము ఈ రసికుని వరించాలి. అప్పుడు కాని కవి కావ్యముల్ల ప్రతిభాపారము రాణకెక్కదు. నేటికాలమున తగిన కవులు లేరనుటకు నాకు సాహసము లేదు. ఆంధ్రభూమి సహృదయులు లేక గొడ్డుపోలేదు. నవ్యకావ్యముల సౌందర్యమును విషమరీతితో ఆస్వాదింప మొదలుపెట్టుట నవకవుల నీరోగచక్షువులోని కల్కము. పురోభాగిత్వమును పూనుకొనుటకు పెనుదీయుని పెద్దలను ఏమీ అనలేము కాని సౌందర్యముద్రను ప్రదర్శింపచేయుటకు నవలావణ్యమును ఆస్వాదింపచేయుటకు తమ విపశ్చిద్దృష్టిని ఏల ప్రసరింపచేయరాదు? దోషముల వెదకుట సులభ మని అనను. వానిని సహించుట క్షమించుట తగు నని పలకను. అరసికరచనలను ఆదరింపవలయు నని కోరుకొనను. కాని తమతమ సహృదయత్వపరీక్షకైనను సౌందర్యసమీక్ష చేయరాదా? ప్రాచీన కావ్యములు కేవలము దోషవిధురము లని కాని నవకవుల కృతులు కేవలము మధురాతిమధురము లని కాని అనలేదు. ప్రాఙ్నవీనభేదములను భావయిత మనసులో ఉంచుకొనరా దని అనగలను. విమర్శకులనూయాగ్రస్తులు అనే అపఖ్యాతి మాసిపోవలయును. అంతరంగవిమర్శ చేయలేనివాని విమర్శ విమర్శ కాదు.

సాహిత్యాస్వాదము సామాన్యకృత్యము కాదు. ప్రతిమనుష్యుడు ధర్మానుష్ఠాత కాలేనట్లు ప్రతిమానవుడూ సాహిత్యాస్వాదము చేయలేడు. కావ్యకర్తృత్వభోక్తృత్వముల కలయికను సమరసముగా సమన్వయించుకొనగలిగిన తత్త్వశీలి అయితేనే అందుకు సమర్థుడు. సాహితీమాధుర్యం తెలుసుకోవటానికి శాస్త్రాల కారానికి అలవాటుపడిన కటుకునాలిక ఉపయోగింపదు. కావ్యసామాన్యంలో అంతటా అఖండంగా అనుస్యూత మవుతూఉన్న ఆత్మశక్తి అహమహమికతో కూడుకొన్నపుడే ఆస్వాదపథములో ఆనందకళ అమృతవాహిని.

---

# అపచారం

## కొడవటిగంటి కుటుంబరావు

జీవితాన్ని గురించి నలుగురూ ఏమనుకుంటున్నారో నాకు తెలుసుకోవాలని ఉండదు. నాఅభిప్రాయాలు మరొకరికి చెప్పను కూడానూ. కాని కనీసం నెలకొక పర్యాయం తెలివిగల ఆడదానితో ఒక గంటసేపు మాట్లాడితే కాని నాకు తృప్తిగా ఉండదు. అనుభవజ్ఞురాలైన ఆడది తనకు తెలియకుండానే జీవితం మీద మంచి వ్యాఖ్యానం చెయ్యగల దని నేను అనుభవంమీద తెలుసుకున్నాను. మగవాడు ఆడదానికంటె దూరం ఆలోచించినా తన తెలివితేటలను కాస్సేపు దాచిపెట్టి మాట్లాడలేడు....

నాకు చప్పున అందుబాటులో ఉండేదీ, కొంతవరకైనా నాకు కావలసిన విధంగా మాట్లాడేదీ సుబ్బులు. నేను సామాన్యంగా వేశ్యలను ఆమోదించను. వాళ్ళలో చాలామందికి ఆసాంతం నటించటం చాతకాదు. నటించటం చాతకాని వేశ్యా, చాతనయిన ఇల్లాలూ నాకు పనికిరారు. సుబ్బులుతో అభయం లేదు. అది నన్ను చూడగానే సంతోషం కనపరిచిం దంటే నేను దాని ఇంట్లో కూర్చున్నంతసేపూ సంతోషంగా ఉండటానికి తయా రన్నమాటే. "ఒక పదిరూపాయ లుంటే బదులిచ్చి దబ్బున ఇంటిదారి పట్టు!" అని విసుగుతో అనగల దమ్ము నేనెరిగినంతవరకు సుబ్బులుకే ఉంది. (సుబ్బులు నాదగ్గిర డబ్బు బదులుగా తప్ప పుచ్చుకో దని నేను వేరే చెప్పనక్కర్లేదు. కాని తీసుకున్న డబ్బు మళ్ళీ తిరిగి మాత్రం ఇవ్వదు — ఇచ్చే టందుకు దానిదగ్గర ఉండదు!)...

ఆనాడు రాత్రి పెందలాడే భోంచేసి సానిసందుకు బయలుదేరాను. ఆసందులో అడుగుపెట్టగానే నాకు "ఇందులోనించి ఎవరో పాతవాళ్ళు వెళ్లారు. కొత్తవాళ్ళు వచ్చారు" అనిపించింది. నాకట్లా తెలుస్తుంది. మావీధిలో మాయింటి పక్కవాళ్ళు ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయినా నేను కనుక్కోలేను కాని సానివీధిలో

ఏవిధమైన మార్పు జరిగినా నాకు తెలిసిపోతుంది. దివ్యదృష్టో ఏదో అయి ఉంటుంది.

కాని దెబ్బ నాకే తగిలిం దని నేను ఏమాత్రమూ ఊహించ లేదు. సుబ్బులు ఇంటిని గుర్తుపట్టలేకపోయాను. ముందు వసారాలో ఒక కిరసనాయిలు బుడ్డి పెట్టి ఉంది; ఒక నులకమంచంమీద ఒక పాలిపోయిన గర్భిణీ స్త్రీ కూర్చుని ఆయాసంతో రొప్పుతూ దగ్గుతున్నది. లంజరికం చేసి సంపాదించిన రూపాయలను గవ్వల కింద ఖర్చుపెట్టే వేశ్యలు అప్పుడప్పుడూ చూస్తూ ఉండడం మంచి దేమో కాని, నేను మాత్రం ఆదృశ్యాన్ని భరించలేకపోయినాను. అక్కడినించి కదిలాను.

సుబ్బులు వెళ్ళిపోయింది. అది పోతాను పోతా నని అంటూనే ఉండింది, కాని నేను నమ్మలేదు. రెండేళ్ళనుండీ అదే కూత కూస్తున్న మనిషి ఆకూత సార్థకంచేస్తుం దని ఎట్లా అనుకోవడం?

తిరిగి వస్తూ కొత్తమనిషిని చూశాను. మెట్లమీద కాళ్ళు పెట్టి అరుగుమీద కూచుంది, వీధికి పక్కమొహంగా. లోపలినించి దీపం వెలుతురు ఆమె కుడిచెంపమీదా కొద్దిగా వక్షస్థలంమీదా పడుతున్నది. ఆమెవీపు నావైపుగా ఉంది. నాఅడుగుల చప్పుడుకు వెనక్కు తిరిగింది. నేను ఆగటంచూసి లేచి నిలబడ్డది.

"ఎంత మంచి జుట్టూ! లేక సవరమా?" అన్నాను ఉపోద్ఘాతంగా.

ఆమనిషి వినిపించుకోలేదో లేక నామాటలు అర్థం చేసుకోలేదో కాని నాకేమీ సమాధానం చెప్పలేదు.

"అమావాస్య వెన్నెలలో నీమొహం ఎరిగిన మొహమల్లే ఉంది. నేను నిన్నెప్పుడైనా చూసిఉంటా నంటావా?"

ఆమనిషి నవ్వి "లేదు కాని దయచెయ్యండి!" అంది.

"ఆపదే దయచెయ్య మంటే నేను లోపలి కనే అర్థంచేసుకుంటాను," అంటూ సమీపించాను.

"నేను కాదన్నానా! రండి!"

"రండీ అంటే కులట!"

"అయితే అయింది, రండి!"

"నేను ఓడాను," అంటూ ఆమెవెంట లోపలికి వెళ్ళాను.

దీపం వెలుతురున ఆమె మొహం చూడగానే నిర్ఘాంత పోయినాను. అంత అందమయిన మనిషి! మొహంలో అంత నాగరికతా, కుదిరికా, నేవళమూ, కళా నేనెన్నడూ చూచినట్టు జ్ఞాపకం లేదు. ఆపదానిలో సౌందర్యానికి ఎక్కువ విలువ ఇవ్వటం మానేసిన తరవాతనే నిజమైన సౌందర్యం నన్ను అమితంగా కలతపెట్టసాగిం దని ఒప్పుకుంటాను.

"ఎంత అందంగా ఉన్నావూ!" అన్నాను. హృదయ పూర్వకంగా. ఆమె నవ్వి "మీవంటివాళ్ళే ఆడవాళ్ళను పాడు చేసేది కాదు" అన్నది.

"నేను నిన్ను పాడుచెయ్యబోవటం లేదు. వెళ్ళిపోతాను అన్నాను."

"ఏం"

"నాకు చక్కని వేశ్యను చూస్తే ఏమాత్రమో భయం"

"ఏం విడ్డూరంగా మాట్లాడతారండీ! ... నిలబడే ఉన్నారు. కూర్చోండి!"

కూర్చున్నాను. తను వచ్చి నాపక్కనే మరొక కుర్చీలో కూర్చుని నావంక పరీక్షగా చూడసాగింది.

"ఆలోచించిన కొద్దీ నీసంగతి విచిత్రంగా ఉంది. నువ్వెవరు? ఒంటరిగా ఎందు కుంటున్నావు? గద్దతన్నుకుపోయినట్టు నిన్ను ఎవరో ఒకరు ఎందుకు తన్నుకుపోలేదు?" అని అడిగాను.

ఆమె మళ్ళీ నవ్వింది,

"గద్దలసంగతి నాకు తెలియదు కాని ఇవాళ ఉదయం నేనిక్కడ దిగినప్పటినుంచీ మాలకాకులు చాలా తారట్లాడుతున్నై. ఒకటి రెండు ధైర్యంచేసి లోపలికి కూడా జొరబడి 'కా కా' మని అరిచినై. చీపురుకట్ట చూపించాను.

నేను ఒంటరిగా ఉండటం లేదు. మాతమ్ముడున్నాడు. సినిమాకు వెళ్ళాడు."

"మాలకాకు లంటున్నావు కాని అవి నిన్ను వదిలిపెట్టవేమో ననుకుంటాను. చివరకు నువ్వు వాటి పాలపడక తప్పదేమో."

"అని మీకు దిగులుగా ఉందా!" అన్నది మళ్ళీ నవ్వుతూ.

"దిగులంటే, దిగులే మరి! తను తప్ప మిగిలినవాళ్ళంతా మాలకాకులే ననుకోని మగవాణ్ణి నువ్వెక్కడన్నా చూశావా? చక్కని ఆపది సంబంధించినచోట!"

"నాకు మగవాళ్ళను గురించి మీరనుకున్నంత తెలీదేమో!" అన్నదామె.

ఆమాటతో నాఅనుమానం కొస్తా రూఢి అయింది.

"నేనెంత గుడ్డివాణ్ణయిపోయాను! నువ్వు భోగందానివి కావు. నువ్వెవరవు?"

ఆమె ఇంకా నవ్వుతోనే "నేను భోగందాన్ని కానని ఎట్లా తెలిసిందీ?" అన్నది.

"నీ అవతారం! నీమాటలధోరణి! నీ ఉచ్చారణ! నన్నిక మభ్యపెట్టలేవు. బుకాయించకు."

"భోగం దంటే ఎవరు?"

"నేను చెప్పలేను కాని నువ్వుమాత్రం భోగందానివి కావు."

"నేను శరీరం విక్రయించుకోవటానికి సిద్ధంగా ఉన్నాను. భోగందాన్నికానా!"

"కావు. నువ్వీవృత్తిలో స్థైర్యం లేవు, ఏదో గీత,, చాలక ఇట్లాదిగావుకాని."

"ఎందుచేతో!"

"నువ్వు అమాయకురాలివి."

"అంటే తెలివితక్కువదాన్ననా?"

"కాదు. మాయలు తెలియనిదానివి. నువు మనుష్యులను మోసం చెయ్యలేవు. నామాట విని విరమించుకో! ఎవరినన్నా డబ్బున్నవాణ్ణి బుద్ధిమంతుణ్ణి చూసుకో?"

"నేను మోసంచేశాను?" అన్నదావిడ గర్వంగా.

"ఎవర్ని?"

"ఎవరినైతే నేం? అయనకు కృతజ్ఞత చూపలేకపోయి నాను. అయన డబ్బు వృధాగా ఖర్చుచేశాను. అయన కోపాన్ని లక్ష్యం చెయ్యలేదు. అయన నన్ను భరించలేక వదిలిపెట్టేశారు. నేను ఒక చెంప వైధవ్యంతోనూ మరొకచెంప సవితతల్లిపోరు తోనూ నరకం అనుభవిస్తుంటే నన్ను ఉద్ధరించిన మనిషి!"

"చేసిందానికి పశ్చాత్తాపపడుతున్నావుగా!"

"లేదు. పశ్చాత్తాపడితే మీతో ఇదంతా చెబుదునా?"

నాకా మనిషి పోకడ అర్థం కాలేదు.

"ఇప్పుడేమయిందీ? పోయినవాడు జారిపోయినాడు. అటువంటివాడు మరొకడు దొరకడూ?"

"దేనికి చెప్పండి! ఒకమనిషిని తృప్తిపరచటం కంటె వెయ్యిమందిని తృప్తిపరచటం ఆడదానికి సులభం కాదూ? ఒక్కడి కోసమని స్వేచ్ఛ ఎందుకు పోగొట్టుకోవాలి? నీతిని బట్టి చూస్తే ఏదైనా ఒకటే కదా!"

"పిచ్చిదానా, వెయ్యిమందిని ప్రేమించటం కంటే ఒక్కణ్ణి ప్రేమించటం తేలికకాదూ? ప్రేమించటంకంటె మనిషికి అందమైన అనుభవం ఏముంటుంది?"

ఆమాట ఎందుకన్నానో ఇప్పుడు నేను ఊహించుకోలేను. ఆమనిషిని చూస్తుంటే నాకు మతిపోయి ఉంటుంది. ప్రేమ ఎరగని నాజీవితానికి నేను ఆక్షణంలో నాకు తెలియకుండానే పశ్చాత్తాప పడి ఉంటాను. అటువంటి స్త్రీని ప్రేమించగలిగితే ఎంతబాగుం టుంది అనిపించి ఉంటుంది నాకు.

ఆమనిషి నావంక ఆశ్చర్యంతో చూసి "ప్రేమించటం అందమైన అనుభవం అని ఎవరు చెప్పారు మీకు?" అన్నది. ఆమె గొంతులో కాఠిన్యం చూసి నేను నిర్ఘాంతపోయినాను.

"ఏమో నేనట్లా అనుకున్నాను," అన్నాను తప్పుచేసిన వాడల్లే.

"మిమ్మల్ని ఏస్త్రీ అయినా ప్రేమిస్తే ఆమనిషిని వెంటనే విదిలించుకోండి! ఆమె మీకెందుకూ పనికిరాదు. ప్రేమించిన ఆడదానికి వళ్ళు తెలియదు. తను ఎంత అధమస్త్రపు మనిషి అయినా సరే తనకంటే ప్రపంచంలో మొనగాళ్ళెవరూ లేరన్నంతగా గర్వి స్తుంది. మతిలేకుండా ప్రవర్తిస్తుంది. ప్రేమించినవాడికి ప్రేమ తప్ప గౌరవమూ కృతజ్ఞతా ఇవేవీ చూపించలేదు. అతన్ని సంతోష పెట్టటానికి సమస్తమూ త్యాగం చేస్తుంది. అందులో అతని డబ్బు కూడా ఉంటుందనే జ్ఞానమైనా ఉండదు. తీరా సర్వనాశం అయే దాకా ఆమనిషికి కళ్ళు తెరుపుడు పడవు!..."

నాలోనించి చెప్ప శక్యంగాని ఆవేదన పుట్టుకొచ్చింది. ఆమె ప్రతిఒకమాటా ఒక బల్లెం అయి ఉంటే నన్నంతకన్న ఎక్కువబాధపెట్టి ఉండేదు. నాహృదయం వలవలా ఏడిచింది. నాకళ్ళవెంట నీళ్ళు రాలేదని కూడా చెప్పలేను. నేనక్కడ ఒక్క క్షణం కూడా నిలవలేక బయటికి వచ్చేశాను...

మళ్ళీ నేనా మనిషిని చూడలేదు. ఆమె సంగతి ఏమయిందో నాకు తెలియదు. కాని ఆమె జ్ఞాపకం వచ్చినప్పుడల్లా "ఎంత నిర్భాగ్యురాలు! ఎటువంటి దేవత!" అనుకుంటాను.

---

# గ్రామఫోను రికార్డులు

శ్రీమతి కృష్ణకుమారి

ఏదైనా ఒకటి పుట్టిందంటే సామాన్యంగా ఏదో మంచికే పుట్టుతుంది. అది క్రమంగా పెరిగి కొద్ది కాలానికి చెడ్డదిగా మారిపోవచ్చును. ఒకొప్పుడు అలాగా మారకపోనూ వచ్చును. ప్రపంచంలో పుట్టిపెరుగుతూండే ప్రతివానికీ వాని భావిజీవితానికి పుట్టుకలోనే అంకెలు గుణించడం హాస్యాస్పదం. అది కాలాధీనం. ప్రజాపతి ఎవ్వరిని కానీ ఆదిలోనే ప్రజలను మీరు దుర్మార్గులు కండి అని నొసటను వ్రాయడు కాని కొందఱు తమతమ స్వభావదార్బల్యాన్ని బట్టి తమ వాతావరణాన్ని బట్టి మష్టులౌతారు. వినంతమాత్రాన సృష్టే మంచిదికాదని తిట్టకూడదు. కాని మానవసంఘంలో ప్రవేశించే చెడుగును చేతనైనంత వఱకు దూరం చేస్తూండాలి.

---

గ్రామఫోనులూ, గ్రామఫోను రికార్డులూ, మొట్టమొదట్లో మంచి ఉద్దేశంతోనే ఆరంభింపబడ్డాయి. కాని చిట్టచివరకు పాడై పోయాయి. వినంతమాత్రాన గ్రామఫోను ఉద్యమాన్నే దూషించడం నాఉద్దేశం కాదు. గ్రామఫోను లంటే సామాన్యమా? ఇప్పుడంటే రేడియోలమీద గ్రామఫోనులు కొంచెం వాసి తగ్గినాయి కాని, గ్రామఫోనులు ఒక విషయంలో రేడియోలకంటె కూడా గొప్పవి. రేడియోలో పాడుతూంటేనే వినబడుతుంది. గ్రామఫోనులో రికార్డయితే చచ్చిపోయినా శాశ్వతంగా వాళ్ళకంఠం నిలిచిపోయి వాళ్ళపేరును శాశ్వతం చేస్తుంది. "అయ్యో! త్యాగ రాజుగారి రోజుల్లో గ్రామఫోనైనా ఉన్నది కాదే." అని విచా

రించేటంత చేశాయి. మొదట్లో కీర్తులు ఉన్న గాయకశిఖామణులంతా తమ కళాశైదగ్ధ్యాన్ని ఈఫోనుల్లో శాశ్వతంగా రికార్డు చేసేశారు. రాచప్ప బెంగుళూరు నాగరత్నం మొదలైన వాళ్లంతా ప్లేటిచ్చినవారే. మరీ మొదట్లో కాక పోయినా కొంతకాలం గడచినమీదట గాయనీమణులు కూడా పాల్గొని ఈఉద్యమానికి జీవ మిచ్చారు. రసికశిఖామణు లైన, గాయకులకీ, శ్రోతలకీ కూడా మంచిపని కల్గింది. అప్పట్లో గ్రామఫోను కీర్తి పేరమువారిం దనే చెప్పవచ్చును. అప్పట్లో శాస్త్రబద్ధ మైన మనోహర గానం విన వస్తూండేది. ఇలాగ కాలం జరుగుతూండగా మొట్టమొదట్లో ఈరంగా న్నలంకరించింది వల్లూరివారి హాస్యం. వీరి కోడిపందెం, బస్తాలమోత, రైలుస్టేషన్, రాధారిబోటు మొదలైన ప్లేట్లు ఆ రోజుల్లో పులుపు నంజుకొన్నట్లు బాగానే ఉండేవి. అమాత్రం హాస్యం ఉండబట్టి అశాస్త్రీయసంగీతం మొగిమ్మొత్తకుండా, సముచితంగా ఉండబట్టి అహాస్యం కూడా మొగిమ్మొత్తకుండా ఉండేది.

కాని రాను రాను ఫోనురికార్డులలో విద్వాంసులకి శాపువెలిత యైంది. హాస్యపుపాలు అధిక మైనది. అది మొదట లేశాకంలో ఉన్నా, తర్వాత దోరపాకంలో బడి మరీ కాలం గడచిన కొలదీ ముదురుపాకమై కొఱకరాని కొయ్యైపోయింది. ఇలాగ హెచ్చైన హాస్యం హాస్యరూపంతో కూడా నిలవకుండా బూతుల బుంగగా పరిణమించింది. దీనితోటి సభ్యలోకంలో ఫోను విలువ తగ్గిపోయింది. ఇది సాజంగా సృష్టిలో కనబడే పరిణామమే. విచిత్రం ఏమీ లేదు. కాని చెడ్డమార్పును చెండాడుకోవడం మంచిది కాదూ?

సాధారణంగా ప్రతిపట్టణంలోనూ కొన్ని వేలూ, లక్షలూ ఫోనులుంటాయి. పల్లెల్లోనే ఉంటున్నాయి వేలు, ఇక పట్టణాలమాట చెప్పే దేమి? ఈఫోనులు కల ఆసామీల్లో చాలామంది విజ్ఞాన మెఱుగని వివేకవంతులు. అవడంచేత వాళ్లు కొనేవన్నీ అపభ్రంశపు మొరటుపాటలే. అప్పన్నా తన్నామన్నా పాటలు, గాజులబేరం పాటలు, ఇంకా ఎన్నెన్నో చెప్పలేనన్ని ఈశాఖలో చేర్తాయి. నిజానికి గాజులబేరం లాంటి పాటలు ఏమాత్రమైనా సహృదయు లైనవాళ్లు విని సహించలేరు. గాజులబేరం కంటే కూడా అధ్వాన్నంపాట లున్నాయని నేను విన్నపుడు నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఇంత అనాగరకము, అసభ్య మైన పాటలు పెద్దపెద్ద నగరాల్లో 3-0-0కీ, 3-8-0కి బహిరంగంగా అమ్ముడుపోతున్నాయి. ఏదైనా జాతీయోద్యమాలకి డబ్బు ఇయ్యడానికి ప్రజలకు ఆర్థికమాంద్యం కాని యిలాటి అసహ్యతను అభినందించి డబ్బు తగులబెట్టడానికి ప్రజలు ధనవంతులే.

విద్యాధికులూ, విద్యావిహీనులూ, ధనవంతులూ, నిర్ధనులూ, రంధ్రాన్వేషకులూ, వినోదపరులూ, వినోదరహితులూ, ఇంటిపోరుచేతనో, ఒంటిపోరుచేతో దేశంలో ముప్పాతికవంతు జనం ఈప్లేట్లను విని కొనీ ఆనందించి తలలూపుతున్నారు. సహృదయ హృదయంగమమూ, ఉన్నతభావ ప్రదీప్తమూ ఐన రసప్రపంచ మంటే ఏమిటో తెలియక ఇలాటి పాటలు విని ఇదే రసమనుకొని, తామొక రసిక శ్రేష్ఠుల మనుకొని అఉద్దేశంతో ఆత్మవంచన చేసుకుంటూన్నారు. హోటలుకీపర్సు, మంగలిషాపులూ, చాకలిలాండరీ, విద్యాధికుని లాడ్జి, ధనికుని వినోదగృహం, జూదరి కేళీగృహం, ఒకటనేమిటి ఎందుకు సర్వసాధారణంగా ఈప్లేట్లే వెదజల్లబడిపోయాయి. వీనివలన కేవలం ఆత్మవంచనే కాకుండా ఎంతమంది నీతిబాహ్యు లౌతున్నారో చెప్పడానికి శక్యం కాదు.

ఆపాటలలో పోనీ యేమైనా విని మెచ్చుకోదగినది ఉన్నదేమో అంటే, అలాంటి దేమీ కనబడదు. మనోహర మైన రాగమా, హుళక్కి. రక్తి ఉన్న దంటే అది అంతకుముందే సున్న. దానిలో ఉన్న దల్లా తందనాలూ, తైతక్కలూ, గల్లంతులూ గడబిడలూనూ. ఆపాటల్లో ఉండే నీచమైన లాలసతనూ, తుచ్ఛ కామాన్నీ పురికొల్పే మాటలకు మాత్రము వలచి వానిని కొంటున్నారు. పాడుపాటలు కొన్నకొలదీ డబ్బునకు చేటు. విన్నకొలదీ విసుపునకు హేతువు. ఉన్నకొలదీ ఒడలు మంట!

అంతగా ఆపాటలే వినాలె నంటే సహజంగా అసంఘటనాలే నిత్యకృత్యా లైన మాలసుడిసెలూ, దొమ్మరగుడారాలూ దేశంలో తక్కువ కాలేదే? అక్కడకు పోయి ఆలకించి ఆనందించరాదా? ఫోనుల్లోక్కూడా ఈపాటల నెక్కించి మన నాగరికతాసభ్యతలకు వెలితి కల్గించుకోవడం ఎందుకు? దేశంలో లౌల్యం ప్రబలి ఇల్లాటి పెకిలిపురాణాలు వెన్నుబలిసి తలలెత్తుతున్నాయి. లేకపోతే తెలుగునాడు ఇంత పాడుపడిన బీడుకాదు.

వీసిమాట అలా ఉంచుతే ఫోనుల్లో రెండో ఆక్షేపణీయాంశం నాటకాలు. ఇక వీటి సొంపు చూద్దాము. నాటకాలు దృశ్యప్రబంధాలు. శ్రవ్యకావ్యాలు కావు. నాటకం ఉన్నదీ అంటే అది రంగస్థలి మీద నటులచేత అభినయింపబడాలి. రసికులు నలుగురూ మెచ్చాలి. అప్పుడు కాని నాటకం వ్రాసిన సార్థకతే లేదు. కాళిదా సంతటి మహాకవి కూడా తను వ్రాసినంతమాత్రాన తృప్తిపొందక 'ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం' అని అంగలార్చినాడు. 'నాటకం' అనే పేరులోనే అయితివృత్తము 'ప్రదర్శనయోగ్యము' అనే అర్థం ఢంకామీద దెబ్బలాగ వినబడుతూంది. అలాంటి నాటకాలు నేటికాలాని కిఫోనురికార్డులవలన విధిగా వినవలసిన (శ్రవ్య) తుక్కులైనాయి. ఇపుడు ఫోనుల్లో ఎన్నో నాటకాలు రికార్డు చేశారు. పోనీ ఆనాటకా లైనా ఏమైనా బాగున్నాయా అంటే శివశివా! అమాటకలలో నైనా తలపెట్టఁగూడదు. పెషావర్ ఎక్స్ప్రెస్‌లాగ ఒకటే పరుగులు. ప్రాణావసానకాలంలో ప్రాణి పడే అవస్థ జ్ఞాపకం వస్తుంది అలొందర చూస్తే. మూడునాలుగు పాత్రలకు ఒకే వ్యక్తి. పాత్రౌచిత్యము, కథౌచిత్యము, ఇత్యాది మాటలు ఆనాటకాలకు

జన్మలో అపరిచితాలు. ఒక్కొకచోట ఉత్తమపాత్రలు ప్రశాంతంగా సంభాషింపవలసినచోట త్రాగుబోతు గద్దింపులు! చీటికీ మాటికీ పాటలు. ఆపాటలకోసమే నాటకప్రుసెట్లు పుట్టినాయి. ఆపాటల్లో, పద్యాల్లో నైనా ఏమీ అధిక్యం లేకపోవడమే కాక అర్థం లేనివీ, అర్థం కానివీ చాలా ఘుట్టా లుంటాయి. ఈనాటకాల్లో ఒకటైన మిస్ 1934 నాటకాన్ని గూర్చి ఒక విద్యాధిక మంచి అభిప్రాయం ఇచ్చి పొగడింది. నేను విందునుగదా, ఇంత చెత్త నాటకం ఇంకొకటి ఉన్నదా అనిపించింది. విద్యావంతులు కూడా ఈతుక్కును పొగడుతున్నా రంటే మనదేశపు కళావిజ్ఞానదౌర్భాగ్యాన్ని గూర్చి ఇంకేరికద్ద మొరబెట్టుకోవడం? ఈవేలాంశత్తిని జూచి మన యీదౌర్భాగ్యానికి ఏడ్వాలో పాడుదేశమా అని పళ్ళు పటపటలాడించాలో, నాటకం చూడకుండానే సౌఖ్యం అనుభవింపజేస్తున్నారు, అహా మనవాళ్ళ సులభపద్ధతులు అని సంతోషించాలో ఏమిచెయ్యాలో అర్థం కావడం లేదు. శ్రవణేంద్రియసుఖం కావా లంటే ఇంకా ఎన్నిపుస్తకాలు లేవు? నయనేంద్రియసుఖం ఫోనునాటకాలవల్ల నాశన మైపోతూంది. తెలుగుగడ్డలో నాటకకళ పురుగుముట్టినట్లు నాశన మౌతూంది. నటకులు ప్రత్యక్షంగా రంగస్థలంమీద అభినయిస్తున్నప్పుడే కళ ఖరాబైపోతే పరికరా లేమీ లేకుండా కేవలం పాటలతో నాటకాల్ని పాడేస్తున్నా రంటే అకళను కూకటివ్రేళ్ళతో త్రవ్వేసినట్లు కాదూ? దేశ మంత శోభాదరిద్రాణ మైపోయిందా? ఈఫోను నాటకాలవలన నిరుద్యోగపు నటకులు కూడా కళ్ళు మురిగిపోతారు కొన్నాళ్ళకి. ఫోను రికార్డుల్లో ప్రసిద్ధగాయకుల పేరే వినబడ్డం లేదు. 'చేసినంతవారికి చేసినంత మహాదేవ' అన్నారు. మనదేశం తొల్లిటి యుగంలో ఎంతటి పాపపుగడ్డో! నేటికాలానికీ కుక్కమూతిపిందెలవంటి అభిప్రాయాలు నాగరికప్రజాసమూహంలో కూడా ప్రబల మైనాయి. కళాజీవం లేని నిర్జీవప్రతిమల లాగ పౌరులు తమకు కాదన్నట్లు వ్యవహరించడంలో సబబేమీ కన్పడదు. సాధ్యమైనంత వఱకీ కళ్ళను తెళ్ళదోసే ఉపాయం చూడాలి.

---

# రాజరాజు

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

### ఏడో రంగం

జాముపొద్దు వేళ.

ఏకాంతమందిరంలో, రాజరాజొక గదిలో కూచుని వున్నాడు.

ఇద్దరు యువతులు వింజామరలు వీస్తుండగా వొకతె తమలపాకుల చిలక లందిస్తున్నది.

మహామంత్రి చిట్టివీరన్న యెదట కూచుని వున్నాడు.

చిట్టివీరన్న—సంస్థానవైద్యు లంతా తలో మాటా చెబుతున్నారు. ఒకరి మాట వొకరికి నచ్చడం లేదు.

రాజరాజు—అది తప్పుడు చికిత్సకు కారణం కావచ్చునే?

చిట్టివీరన్న—అందుకే నేను భయపడుతున్నాను. ఎంత ప్రయత్నించినా వారికి సమీకరణం సాధ్యం కాకుండా వుంది.

రాజరాజు—దిక్కు.

చిట్టివీరన్న—వా రందరికీ భట్టారకులవా రంటే సమానమైన భక్తీ, గౌరవమూ, విశ్వాసమూ వున్నాయి. వారి అస్వాస్థ్యానికి వా రంతా సమానంగానే చింతిస్తున్నారు. ఆకారణంవల్ల అందరూ తీవ్రాలోచన చేసే మాట్లాడుతున్నారు. అంచేత యెవరి నిదానమూ కాదనడానికి వీలుకాకుండా వుంది.

రాజరాజు—ఇప్పుడు చికిత్స యెవరు నడుపుతూ వున్నారూ?

చిట్టివీరన్న—నరసంభట్టుగారు మహాప్రభూ!

రాజరాజు—గుణ మేమయినా కనపడిందా?

చిట్టివీరన్న—వారికి తగ్గుతున్న దనే నమ్మకం. కోనప్పశాస్త్రులుగారు అది గుణం కా దనీ, మరొక దుర్గుణం అనీ వాదిస్తున్నారు. పరాశరభట్టారకులు అనువూ, మినువూ చెప్పడం లేదు. చూస్తూ వింటూ — (అర్థోక్తి)

రాజరాజు—అంతకంటే వా రేమి చెయ్యగలరూ? వృద్ధులను కా దనడానికి వారి కింకా ధైర్యం చాలదు పాపం.

చిట్టివీరన్న—అలాగే తోస్తున్నది. ఇంతకీ: నా వుద్దేశం మనవి చేసుకుంటున్నాను. ఈవృద్ధులవల్లా యేమీ కాదు. పరాశరభట్టారకులవారున్నా యేమీ చెయ్యలేరు. నన్నయభట్టారకుల వారికి వొక్కటే చికిత్స వున్నది.

రాజరాజు—అవిషయమై, మీ కంత నిష్కృష్టాభిప్రాయం వుంటే అచికిత్స మీరే యెందుకు నడిపించగూడదూ? మీదగ్గిర సాధనసామగ్రి తక్కువా? మీరు సాధారణులా? రెండేళ్ళనాడు మహారాణికి సన్నిపాతించినప్పుడు మీరే కదా వొడ్డెక్కించగలిగారు?

చిట్టివీరన్న—చికిత్స అంటే అది ఔషధచికిత్స కాదు మహాప్రభూ!

రాజరాజు—మరేమిటీ?

చిట్టివీరన్న—ఏలినవారి దర్శనం వొక్కటే దానికి తగిన చికిత్స. ప్రభువుల అనుగ్రహమే దానికి అమోఘౌషధం.

రాజరాజు—వల్లకా దనలేదే? ఇప్పటికీ అది నిషిద్ధం కాలేదే?

చిట్టివీరన్న—చర్చలవల్ల యిప్పుడు ప్రయోజనం లేదు. తమరు దయార్ద్రహృదయులు కావాలి. నిజానికి, భట్టారకులవా రలా చివికి చివికి శీర్ణించిపోవలసినవారు కారు.

రాజరాజు—అవును. అది యెరుగుదును. అయితే, వారి కా దుర్దశ పరాపాదితం కాదు, స్వయంకృతం.

చిట్టివీరన్న—చర్చవల్ల ప్రయోజనం లే దని—(అర్థోక్తి)

రాజరాజు—(కొంచెం చురుగ్గా) మరేమంటా రండీ?

చిట్టివీరన్న—వారి భాగ్యం తమ చేతుల్లో వున్న దని విన్నవించుకుంటాను.

రాజరాజు—తెనిగించి చెప్పండి.

చిట్టివీరన్న—ఆస్థానికి కావలసిం దని తమ రొక్క మాటు వర్తమాని స్తే—(అర్థోక్తి)

రాజరాజు—అసంభవం. అసంభవం.

చిట్టివీరన్న—(నిర్విణ్ణు డవుతాడు).

రాజరాజు—ఆదిలో ఆస్థానమర్యాదలు అతిక్రమించినవారు వారే అని మీకు తెలవనే తెలుసు. అయినా తమకై తాము వారు వస్తే నేనేమీ ఆక్షేపించను. వెనకటి సంగతు లేమీ వుటంకరించను. ఈ నడమంతరపు కల్లోలం వచ్చినట్టు స్ఫురణ కూడా కలగనివ్వను. వా రప్పు డెందు కలా వ్యగ్రు లయినారో నేను గుర్తించకపోలేదు. వారి మీది నాభక్తి యీషన్మాత్రమూ కలుషితం కాలేదు. గౌరవాదరాలున్నూ క్షీణించలేదు.

చిట్టివీరన్న—అది తెలుస్తూనే వున్నది.

రాజరాజు—మరి నే నేమీ చెయ్యలేను.

చిట్టివీరన్న—వారు బ్రాహ్మణమాత్రు లయితే వారి సంగతి నేను స్మరించకే పోదును. గొప్ప పండితులూ, మహాకవులూ మాత్రమే అయినా నే నేమీ కలగజేసుకోకపోదును; కాని యేలిన వారికి అంకితంగా వారు రచిస్తూ వున్న ఆంధ్రభారతం—(అర్థోక్తి)

రాజరాజు—ఆవిషయమై నే నెంత మథనపడుతున్నానో మీరు తెలుసా?

చిట్టివీరన్న—తెలుసు. మహాప్రభూ! పూర్తిగా తెలుసు. కనకనే తమ యెదట మళ్ళీ నే నీవిషయం ప్రస్తావించగలిగాను. తమ కంత తపన వున్నప్పుడు పట్టుదల కాస్త సడలించుకో గూడదా? నేను భట్టారకులవారిని పూనుకు వస్తున్నా నని నన్నేలిన వారు భావించకూడదు. వా రిప్పుడు అస్వస్థులై మంచానపడిపోవలసినంత దుస్థితిలో వున్నారు. లేకపోతే, ప్రతిష్ఠాపిశాచాన్ని వుచ్చాటనం చేసి వారినే నేను తమ సన్నిధికి తేగలిగి వుందును; కాని ఆపని చెయ్యడాని కెంతమాత్రమూ వీలులేని — (అర్థోక్తి)

రాజరాజు—ఇక మీ రా విషయం పదేపదే యెత్తవద్దు.

చిట్టివీరన్న—అయితే భట్టారకులవారి కిక రక్షణ లే దన్నమాటే.

రాజరాజు—పోనీ, వారు చేసిన ధర్మనిర్ణయం తప్పని వారిచేత అనిపించగలరా మీరు?

చిట్టివీరన్న—వా రిప్పు డున్న ఉన్మాదావస్థలో—(అర్థోక్తి)

రాజరాజు—ఆమాట అన్నప్పుడు వా రున్మాదావస్థలో లేరవా మీ అభిప్రాయం?

చిట్టివీరన్న—చర్చ వద్దని నా మనవి. అది యిదివరకే కావలసినంత కంటే యెక్కువ అయిపోయింది. స్థితిగతు లిలా విషమించడాని కదే కారణం కూడాను. ఇంతకీ: ఈనడమంతరపు కల్లోలం వచ్చినట్టే తోచనివ్వ నని తమ రిప్పుడిప్పుడే — (అర్థోక్తి)

రాజరాజు—దాని కిక్కడ కాదు సమన్వయం. (కొంచెం హేళన కనపరస్తూ) అసందర్భం వేరు. మీరు ముఖపిధానం చెయ్యడానికి చూడకండి.

చిట్టివీరన్న—(కొంచెం చురుగ్గా) అనుగ్రహించ మని ప్రార్థించడం ముఖపిధానం చెయ్యడమా మహాప్రభూ? భట్టారకులవారు నాకు వియ్యంకులు కారు. సన్నిహితు లయినా కారు. భారతాంధ్రీకరణంవల్ల కూడా నాకు కలిగే ప్రయోజనం యేమీ లేదు. నే నేలినవారి సేవలో దీక్షితుణ్ణయి వున్నాను. తమకి అభ్యుదయం కోరడమూ, సాధించడమూ — ఇదే నాపరమావధి. భట్టారకుల వారున్నూ ప్రభువుల అభ్యుదయం ఆకాంక్షించేవారే. అయితే; హఠాత్తుగా పొరపొచ్చాలు వచ్చినవి. వాటిని సవరించకపోతే నే నుండి లాభం యేమిటి?

రాజరాజు—దాని కిదా మార్గం? (కొంచెం తీక్ష్ణంగా చూస్తాడు)

చిట్టివీరన్న—(లేస్తూ) సరే. నా కోరిక మన్నించకపోయినా, తాము అసాధారణదయాదాక్షిణ్యాలే కనపరిచారు. ఇది మాత్రం యేమి తక్కువా? నా ఆశలు భగ్నం కాలేదు. ఇక అక్కడ కూడా మళ్లీ ప్రయత్నించి చూస్తాను. నేను కృతార్థుణ్ణి కాగల ననే నా నమ్మకం.

రాజరాజు—మీ ప్రజ్ఞ అలాంటిదే. తప్పకుండా కృతార్థు లవుతారు. విధిగా ప్రయత్నించండి. చూశారా? వారికి మనస్థిమితం లేదని చెబుతున్నారు మీరు. అంటే, మీరు తీసుకురావాలని ప్రయత్నించినప్పుడు, వారు, అందు కనుకూలమైన స్థితిలో వుండకపోవచ్చు. అందుకు మీ రేమీ విచారించనక్కరలేదు. వా రెప్పుడు రాగలిగితే అప్పుడే—వేళా పాళా మీరు చూసుకోనక్కరలేదు. అర్థరాత్రి బుద్ధిపుడితే అప్పుడే తీసుకురావచ్చు.

చిట్టివీరన్న—(దోసిలివొగ్గి) మహాప్రసాదం.

రాజరాజు—వస్త్రాభరణాల విషయమై కూడా పట్టింపు చూపించనక్కరలేదు. ఎలా వున్నవా రలా బయలుదేరినా సంతోషమే.

చిట్టివీరన్న—చిత్తం చిత్తం, మరి సెల విప్పించండి.

రాజరాజు—వెళ్లిరండి.

(చిట్టివీరన్న వెళ్లిపోతాడు)

తెరలో

మహాప్రభూ!

రాజరాజు—ఏమి?

తెరలో

మహారుద్రయ్యవారు కనిపెట్టుకుని వున్నారు.

రాజరాజు—తీసుకురా.

(అప్పుడు మహారుద్రయ్యవస్తాడు. కూచోండి" అన్నట్టు, రాజు, ఎదట అంగుళి నిర్దేశం చెయ్యగా మహారుద్రయ్య మండె మీద కూచుంటాడు. తరవాత రాజు పరిచారికల కేసి చూస్తాడు. రాజు ఇంగితం కనిపెట్టి వాళ్లు వెళ్లిపోతారు)

రాజరాజు—ఏమయింది?

మహారుద్రయ్య—యథాప్రకారానికి భంగం లేదు. మహారాణీ అనుదినమూ కదుపుతూనే వున్నారుట. తామున్నూ సందర్భం అయినప్పుడల్లా పోరుతూనే వున్నారుట; కాని "యిప్పుడు కాదు" అని తప్ప మరో ప్రత్యుత్తరం లేదంటారు తమ్ముడుగారు.

రాజరాజు—మరి అబ్బాయి?

మహారుద్రయ్య—గడియసేపు వుపోద్ఘాతం నడిపి, వారు సావధాను లైనట్లు గుర్తించి, మెల్లిగా అందించగా తడుముకోకుండా "యిప్పుడు తొందరేమిటి?" అనేసి వూరుకున్నారు.

రాజరాజు—అలాగేం?

మహారుద్రయ్య—ఎన్ని మాట్లు—ఎన్ని విధాల మార్చి అడిగినా అదే సమాధానం.

రాజరాజు—(ఆలోచనలో పడతాడు)

మహారుద్రయ్య—మూడు గడియలు చెప్పినా పూర్తి కాని సంగతి మూడు మాటల్లో తేల్చేస్తారు. ఆ మితభాషిత వొకనాటి కంటే వొకనాడు పెరిగిపోతున్నది.

రాజరాజు—మితభాషిత్వం వొక్కటే అయినా వొకదారే. నాలుక పెరుక్కున్నా అన్నమాట తిరక్కపోవడం కూడా వొకటున్నది కదా?

మహారుద్రయ్య—అదిన్నీ అసాధ్యంగానే వున్నది మహాప్రభూ!

రాజరాజు—ఇలాంటివాడు భార్యకేమి వుల్లాసం కలిగించగలడండీ?

మహారుద్రయ్య — చిత్తం, చిత్తం. ఎంతో కాలంగా నేనీ సంగతే యోచిస్తున్నాను. చివరికి నా కొక్క వుపాయం కనపడ్డది.

రాజరాజు—ఏమిటదీ?

మహారుద్రయ్య—వారికంటే మితభాషిణి అయిన పిల్లను తెచ్చి పెళ్ళిచెయ్యడం.

రాజరాజు—(కొంచెం నిరసనగా) ఏదో శాస్త్రం చెప్పినట్టున్నది మీ మాట.

మహారుద్రయ్య—(చకితుడై వూరుకుంటాడు).

రాజరాజు—పెళ్ళే వద్దంటున్నాడు కదా?

మహారుద్రయ్య—అది ఆశాభంగంవల్ల కలిగిన నిర్వేదం మహాప్రభూ! అది స్థిరమా? ఉండుండి యెప్పుడో వొకనాడు—(అర్థోక్తి)

రాజరాజు—అది సరే. అయితే, సర్వమూ కాలానికి విడిచిపెట్టి మనం వూరుకోడం మంచిదా?

మహారుద్రయ్య—ఎప్పుడున్నూ కాదు. మన ప్రయత్నంలో మనం వుండాలి. తీవ్రంగానే ప్రయత్నించాలి.

రాజరాజు—ఉపాయం?

మహారుద్రయ్య—ఒక రాజపుత్రిక నయినా మనం వారి కేకాంతంలో చూపించగలిగితే—(అర్థోక్తి)

రాజరాజు—అలా అన్నారా? (ఓరగా పైకి చూస్తూ, శిరఃకంపం చేస్తూ, సాలోచనగా) ఎవరున్నారూ? అందుకు తగిన రాజపుత్రిక యెవరూ? మన ప్రయత్నాల కంగీకరించేరా జెవరూ?

మహారుద్రయ్య—పైవారిలో అయితే యిది సాధ్యపడేది కాదు. మన మండలేశ్వరు లయితే—(అర్థోక్తి)

రాజరాజు—అవునవును. మీరు చెప్పింది బాగున్నది. పోల్నాడు మండలేశ్వరుడు మన ఆజ్ఞలకు వ్యతిరేకించడు. అతని కూతురు కూడా లక్షణవతిగా కనపడుతుంది.

మహారుద్రయ్య—అవును. మహాప్రభూ! చక్కదనంలోనే కాక, విలువిద్యలో కూడా ఆమె ప్రసిద్ధి కెక్కి వున్నారు.

రాజరాజు—వారికీ మనకీ తరతరాలుగా యెంతో కొంత బంధుత్వమున్నూ వున్నది. మన మంటే అతనికి గురుభావం కూడా వున్నది.

మహారుద్రయ్య—జ్ఞాపకం వచ్చింది మహాప్రభూ! తమకి శబ్దవేధ యేలినవారే నేర్పినట్టు వొకమాటు వారు సెల విచ్చారు.

రాజరాజు—కనక మీరొకటి చెయ్యండి.

మహారుద్రయ్య—సెల విప్పించండి.

రాజరాజు—మల్లెసాల ప్రాంతంలో మెకాలు విజృంభించి కల్లోలపెడుతున్నట్టూ, అది నివారించవలసినట్టూ అక్కడివారి విన్నపాలు తెప్పించండి. మనం సుబుద్ధిఅయ్యవారిని జతచేసి అబ్బాయిని పంపుదాం. సరిగా అదే సమయంలో చెలికత్తెలను మాత్రమే తోడిచ్చి తన కూతుర్ని వేటకు పంపేటట్టు విశ్వనాథభూపతికి వర్తమానం పంపండి.

మహారుద్రయ్య—చాలా బాగున్నది. ఇది తప్పకుండా కార్యకారి కావచ్చుననే నాకు తోస్తున్నది మహాప్రభూ! రేపే సర్వానికీ వుపక్రమణం చేసి నాలుగు దినాలలో సంధానం కలిగిస్తాను.

రాజరాజు—తరవాతి సంగతి అప్పుడు చూసుకుందాం. మనం మరి విహారానికి వెడదామా?

మహారుద్రయ్య—చిత్తం. గుర్రాలు సిద్ధంగా వున్నవి. పరివారం కనిపెట్టుకుని వున్నది.

రాజరాజు—పదండి.

(ఇద్దరూ లేస్తారు; కాని రాజు నుంచునే వుంటాడు. అది చూసి మహారుద్రయ్య వెళ్ళిపోతాడు. ద్వారం కేసి చూస్తూ, రాజు "ఎవ రక్కడ?" అనగా "చిత్తం చిత్తం" అంటూ వొక పరిచారిక వచ్చి యెదట నుంచుంటుంది.

రాజరాజు—మహారాణీ సెలవేమిటో కనుక్కో. అంగీకరిస్తే తామే యిక్కడికి రాగలరో, మనమే అక్కడికి వెళ్లాలో—తెలిసిందా ?

పరిచారిక—చిత్తం మహాప్రభూ !

(పరిచారిక పక్కకి తప్పుకుంటుంది. రాజు వెళ్లిపోతాడు)

పరిచారిక—(ఎదట చూస్తూ) అన్నా !

అన్నపూర్ణ—(వచ్చి) ఎందుకు తమ్మా ?

పరిచారిక—వినబడిందా ?

అన్నపూర్ణ—కిన్నెరలు మోగినట్టుండగా వినపడకేం ?

పరిచారిక—మూడుపొల్లు మహారాణీ యిక్కడికే దయ చేస్తారు. పరివారం అంతా సిద్ధంగా వుండాలి. నాలుగ్ఘళ్ల రాత్రి అయేటప్పటికి పరికరా లన్నీ అమరి వుండాలి.

అన్నపూర్ణ—సరే.

పరిచారిక—వీణావాదనకు మంగతాయిని నియమించు. దానికి మార్దంగికురాలు శేషశాయి.

అన్నపూర్ణ—చాలా బాగుంది.

పరిచారిక—వేణుగానానికి కృష్ణవేణిని ఏర్పుచు. దానికి మార్దంగికురాలు కిన్నెరసాని.

అన్నపూర్ణ—మొలిచినట్టుంటుంది జత.

పరిచారిక—నృత్యానికి రంగనాయకి జట్టుని నియమించు.

అన్నపూర్ణ—బాగుంది.

పరిచారిక—సన్నిధిని వుండవలసిన వంతు నాదీ నీదీనీ. తెలుసా ?

అన్నపూర్ణ—అహా.

పరిచారిక—ముందు, దీపాలు పెట్టేటప్పటికి పన్నీరు—మల్లి నూనె—తెలిసిందా ?

అన్నపూర్ణ—తెలిసింది.

పరిచారిక—మరి పద. (ఇద్దరూ వెళ్లిపోతారు),

---

# తెలుగు టాకీలు - పాత్రౌచిత్యము

ఏ. వి. సీతారామయ్య ఎం. ఏ

నాటకమునకు గాని సినిమారంగమునకు గాని పాత్రౌచిత్యము పాటించిన గాని కథ రక్తి గట్టదు. పాత్రకు తగిన నటుని యెన్నుటలోనే చాలవరకు నేర్పు గనపరచాలి. ఒకరు యెన్నుకొనవలసిన అవసరం లేదు నాటకరంగంలో. ఎవడికి వాడే పెద్దపెద్ద పాత్రలు చదివి తయారై వుంటాడు. ఏ కంట్రాక్టరో తీసుకెళ్లి ఆడిస్తాడు. కాని సినిమారంగంలో మాత్రం నటులను నాటకంలోకంటె జాగ్రత్తగా యెన్నుకొనవలెను. కారణ మేమంటే ? నాటకం ఈరోజున బాగుండకపోతే మరునటి ప్రదర్శనంలో సరిజూచుకోవచ్చు. ఒక పాత్రకు ఒకనటుడు సరిపడలేదని తోచినప్పుడు మరునటి ప్రదర్శనానికి మరొకని యెన్నుకోవచ్చు. కాని సినిమాలో ఈ విధంగా చేసేందుకు వీలులేదు. ఒకఫిలిం తీశామూ అంటే ఇక అది అట్లా వుండిపోతుంది శాశ్వతంగా. బాగుండకపోయినా మార్చేందుకు వీలులేదు. వీలయినంతవరకు కొన్ని దృశ్యాలను మార్చవచ్చు వున్నవి కొన్ని తీసివేసీ లేనివి కొన్ని కలిపీనీ. కాని నటుల విషయంలో బాగున్నా బాగుండకపోయినా యిక అంతే. మొదట్లోనే జాగ్రత్తగా యెన్నుకొనకపోతే ఫిలిం తీసినతరువాత యిక నంతే. కళానైపుణ్యాన్ని ప్రకటించే శాశ్వతమైన రికార్డు ఫిలిం. అందువలన కళాదృష్టితో చూస్తే పాత్రధారులను యెన్నుకొనడంలో సినిమారంగంలో బహుజాగరూకతతో ప్రవర్తించాలి.

పాత్రలకు తగిన నటులను యెన్నుకోటంలో శరీరసౌష్టవం, గాత్రగాంభీర్యం మొదలైనవి చూడాలి. పాత్రపోషణ చేయగల నటుడై వుండాలి. పాత్రౌచిత్యానికి భంగం లేకుండా వుండాలి. ఇది సినిమాలో మరీ ముఖ్యం. 'పాదుకా' పట్టాభిషేకం టాకీలో పెళ్లికుమారుడైన శ్రీరాముని పాత్రకు ఏవయసు నటుని కుదిర్చారో, ఎటువంటి శరీరసౌష్టవంతో దర్శన మిచ్చాడో తెలుగుప్రజలకు అనుభవమే. బాలకుడైన శ్రీరాముని చూపించలేకపోతే ఆరంగమే వదలివేయాలి. ఆవిధంగానే 'సీతాకల్యాణం' టాకీలో సీతపాత్ర. పెళ్లికూతురైన సీతపాత్రకు లేత వయిసు గల ముద్దుబాలికగా కనబడగల నటి కావలెగాని వయసు ముదిరినదిగా కనబడరాదు. అమాయకపు చూపులతో ముద్దులు మూటగట్టు పెండ్లికుమార్తెగా కనబడాలి గాని వొయ్యారపు కనుసైగలు చేయు జాణగా కనబడరాదు.

పౌరాణికగాథలు మన సినిమారంగంలోని కథలు దాదాపుగా అన్నీకూడా. కారణం ఏమంటే భగవంతుడి పేరుపెట్టి ఏపని చేసినా మనవాళ్లకు యిష్టమే గాబట్టి. పౌరాణికగాథ ఐతే సరియైక నటులు, నటన, భాష, ఛాయాచిత్రగ్రహణం తదితరశాస్త్రాదివిషయాలు జనానికి అక్కరలేదు. పౌరాణికగాథలయందు ప్రజలకున్న అభిమానం, భక్తి, ఆదరణలను అండగా జూచుకొనే గదూ పెట్టుబడిదారులు ఎటువంటి చవటఫిలిమున కైనా లక్షలాదిగ గణించుతున్నారు ? కాని పౌరాణికగాథలనే తీయుదురు గాక. సరియయిన పాత్రల యెన్నిక చేయవలె. ప్రాచీనహైందవ నాగరికతకు పౌరాణికవర్ణనలకు తగిన అంగసౌష్టవము కలిగిన పాత్రధారులను యెన్నుకోవాలి. బాగా పాడగలడని గాని, పేరున్న దని

గాని, స్టూడియోదారులకు మిత్రుడని కాని నటుని యెన్నుకొని ఫిలిం తీస్తే తగుమాత్రం లాభం వచ్చినా రావచ్చు గాని కళాదృష్టిలో అసహ్యాకరంగా పరిణమిస్తుంది. కొంచెం జాగ్రత్తతో తగిన నటులను యెన్నుకుంటే ఫిలిం తీసేవారికి ఆర్థికంగా గూడా లాభమే. ఫిలిమును యెక్కువకాలము యెక్కువమంది ప్రజలకు జూపించవచ్చు. ఆదర్శయుక్తమైన నటసమ్మేళనముతో శాస్త్రప్రవీణుల సలహాలతో తెలుగుఫిలిం ఇతరరాష్ట్రములందు సయితము ప్రదర్శింపవచ్చు నని నేను ఘంటాపథముగా చెప్పగలను. సి. పుల్లయ్యగారిచేత డైరెక్టుచేయబడిన (ఈస్టిండియాకంపెనీవారిచేత తయారు చేయబడిన) 'లవ, కుశ' ఫిలిం ఆంధ్రుల ఆదరణ కింత పాత్రమగుటకు యెక్కువగా నటులను యెన్నుకొనుటయందు పుల్లయ్యగారు కనపరచిన కుశాగ్రబుద్ధియే కారణము. సరియైన నటులను యెన్నుకొనిన తరువాత వారిని తర్ఫీదు చేసి 'డైరెక్టు' చేయగల సామర్థ్యము కూడ నుండుటవలన వారి లవకుశ అంత జయప్రదమైనది. అది లేనియెడల ఫిలిమునకు రాబడి తగ్గుటయే గాక నటునకు తీరని నష్టము కలుగగలదు. 'లవకుశ' ఫిలిములో పారుపల్లి సుబ్బారావు శ్రీమతి శ్రీరంజని తమతమ పాత్రముల కెంత ఒప్పియున్నారో 'సీతాకల్యాణము' నందు మాధవపెద్ది వెంకట్రామయ్య గారు అంత తగియున్నారు. కాని వెంకట్రామయ్యగారి కళానైపుణ్యము ప్రకటించుటకు అవకాశము లేకపోగా వారి శక్తిసామర్థ్యములు బలియివ్వబడినవి.

నటులను యెన్నుకొనిన తరువాత వారివారి శక్తిసామర్థ్యములకు తగినట్లు వారివారి అలవాట్లు (idiosynacrasies) ఇష్టాయిష్టములు గుర్తించి సందర్భమును వారికి బాగుగా బోధించి కావలసిన రసమును ప్రదర్శింపమని నటుని కోరవలయును గాని డైరెక్టరు తన నిరంకుశసలహాలకు నటుని బద్ధునిచేసి తన నిబంధనల ప్రకారమే నటించునట్లు చేయకూడదు. వేషధారణమున సైతము, పాత్రౌచిత్యము నటునికి చక్కగా బోధించి, ఆపాత్రయొక్క స్థానము (status) అప్పుడున్నటువంటి సందర్భము (situation) నటునికి అర్థమగునట్లు తెలియజేసి, అతని యిచ్ఛవచ్చినట్లు వేషధారణ మొనర్చుటకు స్వాతంత్ర్య మీయవలయును. రాజువేషమునకు వేయు దుస్తులున్నవనుకొనుడు. అవి ధరించిన ఒకడు రాజుగా కనబడును. మరియొకడు అవే ధరించిన హాస్యగాడుగా కనపడును. నటునికి తగిన వేషధారణ గూడ అవసరము. ఇటువంటి పరిస్థితులే యుండియుండిన యెడల వేషధారణలో మొనగాడని పేరుగాంచిన వెల్లూరునాగరాజరావు దశరథపాత్రలో అట్లు చెంచువాని మాదిరి వుండనేల?

సినిమాలో చాలవరకు దుస్తులతో నింపబడిన రంగస్థలముందలి భూమికగా గాక శరీరసౌష్ఠవమును ప్రదర్శింపవలసిన అవసర మెక్కువగా వుంటుంది. అందువలన నటులకు చక్కని దేహ ముండాలి. తప్పనిసరియైనప్పుడు తగిన ఆభరణాదులతో ఉత్తరీయములతో అసంభ్యముగా నుండకుండునట్లు అలంకరించుకొని శరీరవికారములను కప్పిపుచ్చుకోవాలి. లేకపోతే 'పాదుక' లోని యడవల్లివారి జయ్యరుగారు తయారవుతారు.

సరియయిన నటుని, దేహసౌష్ఠవముగల నటుని, పాత్రకు తగియున్న నటుని సమకూర్చుకుని, అతని శరీరసౌష్ఠవమునకు పాత్రయొక్క ఔచిత్యమునకు తగిన వేషధారణ మొనరింపజేసిన తరువాత, పాత్రకు తగిన భాషను ఏర్పరచాలి. 'పాదుక' లోని కైక భాషగా నుండరాదు. సంగీతము సైతము పాత్రకు ముఖ్యముగా సందర్భమునకు తగియుండాలి. ఒక పెద్ద దర్బారులో ఏ ఆస్థానవిద్వాంసునిగానో ఒకనిచేత కొంతకాలము పాడించవచ్చు గాని రాజే ఒక కీర్తన ఆలాపనచేయడం మొదలెడ్తే సందర్భం పాడైపోతుంది. పాత్రయొక్క స్వరూపం మరుగుపడిపోతుంది. ముఖ్యంగా రాగాలాపనలో ఈ విషయం జ్ఞప్తియం దుంచుకోనకపోతే పెక్కుపాత్రలు నాశనమైపోతారు. ఒకడు బాగా పాడగలడు గదా యని సందర్భమును ప్రక్కనటుని స్థానమును గుర్తించకుండా పాడేందుకు అవకాశ మిస్తే సందర్భం పాడైపోతుంది. ప్రక్కపాత్రధారునికి నష్టం కలుగుతుంది. 'సీతాకల్యాణం' లో శ్రీరాముడు రాగాలాపన చేస్తుంటే విశ్వామిత్రుడు, తలతిప్పుతూ, close గా follow అవుతూ, దానిని ఆనందించవలసివచ్చింది. అటువంటిది విశ్వామిత్రపాత్రకు ఎంతహాస్యాస్పదమైన విషయం? దానికి నటుని దూరిన లాభము లేదు. ఆసందర్భాన్ని ఏర్పరిచిన వారిది తప్పు. అటువంటి వాటివలన పాత్రౌచిత్యము పాడైపోతూంది. కైక ఆదేపనిగా గిరికీలు కొట్టిస్తూ సంగీతంపాడ్తే దశరథుడు గ్రుడ్లు ఒప్పగించి చూడాల్సిందే గాని ఏంచేయగలడు?

ఇటువంటి విషయా లన్నీ గుర్తించి సరిపెట్టుకుంటే గాని పాత్రౌచిత్యం ఏర్పడదు. పాత్రౌచిత్యం వుంటేగాని కథకు సరియైన వాతావరణం కలగదు. సరియైన వాతావరణం కలిగితే గాని (Production) కథ రక్తిగట్టదు. ఇకముందు తీయబోయే తెలుగుటాకీలలోనైనా పాత్రౌచిత్యం కథకు చాలా ముఖ్యమని గమనిస్తా రని ఆశిస్తున్నా.

సూచన

ఇది ౧౯౩౬ లో రాయబడ్డ వ్యాసం. ఇప్పుడు చెప్పలేని ఏవో కారణాలవల్ల యిది కైరువిలియా అయిపోయి వూహించరాని కారణాలవల్ల, యిప్పుడు దొరికింది. సీతారామయ్యగారు ఇప్పుడిది రాసివుంటే ఇటీవల వచ్చిన ఫిలుములను గురించే యిందులో ప్రస్తావించివుందురు. అయినా, ఆలోటు కనపడకుండా తెనుగుఫిలిండైరక్టర్లు ఇప్పటికీ అస్థితిలోనే వున్నారు. పరిశీలనవల్లా అనుభవంవల్లా, ఇవి కలగడానికవసరమైన గ్రంథావలోకనంవల్లా వారిలో యేమీ మార్పుగలిగినట్టు కనపడదు. ఈపై సన్నివేశాలు కూడా వారికి తటస్థించినట్టు తోచదు. పాత్రలను నిర్ణయించడంలోనూ, వేషధారణం విషయంలోనూ అలా వుండగా, కథనుగురించీ, కవులను గురించీ, భాషనుగురించీ, రసమునుగురించీ ఇప్పటికీ డైరక్టర్లు అశ్రద్ధనే నిరాదరణమునే కనపరుస్తున్నారు. ఇప్పటికీ పాతవాటి విలువ బాగా గ్రహించలేదు. ఇది తమ డైరక్టరుషిప్పుకెంత భంగకరమో వారు గ్రహించలేని స్థితిలో వున్నట్లున్నారు. వారి విషయంలో యేమయినా యిది తెనుగుఫిలిముల ప్రశస్తికి చాలా ప్రతికూలం.

సీతారామయ్యగారు ఈ విషయాలలో తమ నూతనానుభవాలు మళ్లీ రాస్తా రని ఆశిస్తున్నాము. సంపాదకుడు

# ఆంధ్రుల వలస

శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి

దేశచరిత్రలో ఒక ప్రాంతములవారింకొక ప్రాంతములకు వలస పోవుట మామూలువిషయము. అందులోను ఒక విశాల దేశమునుండి పక్కనున్న కొద్దిరాష్ట్రములకు వలసపోవుట మిక్కిలి సామాన్యము. అదే విధముగ బ్రిటిషుగవర్నమెంటుకింద నున్న ఆంధ్రదేశము తన విస్తీర్ణమునకు తగినంత సౌభాగ్యమును అనుభవింపలేకపోవుటవలన అచటి ఆంధ్రులు యితరరాష్ట్రములకు వలసపోవుట తప్పనిసరి యగుచున్నది.

నిజమునకు ౧౩ జిల్లాల విస్తీర్ణము, రెండున్నరకోట్ల జనసంఖ్య కలిగిన విశాలభూభాగమునకు ప్రత్యేకరాష్ట్రము లేకపోవుటచేత ఇట్టి కష్టము కలుగుచున్నది. స్వర్గీయ బసవరాజు అప్పారావుపంతులుగారు "ఆంధ్రమాత నన్ను కొస్త ఆదరించియున్నయెడల ఇంత దూరదేశమునకు ఏల వలసరావలయును." అన్నట్లు ఆంధ్రదేశమున వారికి తగినవృత్తులే దొరికినచో వారి కట్లు వలసపోవు కిగ్మ మేమి వచ్చినది! సర్వకాలజీవనదాయకములైన జీవనదులు, వివిధసస్యప్రదాయకములైన సుక్షేత్రములను గూడా కలిగి ఒకానొకనాడు మగధ మహారాష్ట్రదేశములను కూడా జయించి వివిధపరిశ్రమలకు కళలకు శిల్పమునకు కూడా ఖ్యాతివహించిన ఆంధ్రమాత నేడు తన కన్న సంతానమునకు తినుటకు చాలిన తిండి కట్టుటకు చాలిన బట్ట కూడా ఈయచాలని స్థితికి వచ్చినది. దీనికి ప్రధానకారణము ఆంధ్రదేశమునకు ప్రత్యేకరాష్ట్రము లేకపోవుటయే. "అయినవారికి ఆకుల్లోను కానివారికి కంచాలలోను." అన్నట్లు దేశములో వున్న వున్నతోద్యోగాలన్నీ అరవవారికి అర్పించి వర్తకమంతా మార్వాడీలకు గుజరాతీలకు వశపర్చి కన్నసంతానమును కానిదేశములకు వలసకు పంపుట ఆంధ్రమాతకు తప్పనిసరి అయినది.

ఒకసారి గోలకొండ పత్రికయందు శ్రీమతి సరస్వతీదేవిగారు వలసిపోయిన ఆంధ్రుల సంఖ్య యీవిధముగా యిచ్చివున్నది.

అండమాను నికోబారుదీవులు ౨౧౨. బెలూచిస్తానము ౩౬. అసాము ౫౨౫౯. బీరారు ౨౩,౦౦౦. బొంబాయిరాజధాని ౧,౦౯,౯౦౭. బర్మా ౯,౬౦,౬౦౧. కూర్గు ౨,౯౪౮. మధ్య పరగణాలు ౨౨,౬౫౮. పశ్చిమోత్తర పరగణాలు ౨౧౨. పంజాబు ౮. సంయుక్తపరగణాలు ౬౪౦. బరోడా ౩౬౨. మధ్య ఇండియా ౪౪౪. రాజపుత్రస్థానము ౬౧.

ఈసంఖ్యలయందు విదేశములలోని సంఖ్యలును మైసూరు వంగదేశములయందలి సంఖ్యలును చేరలేదు. ఇంతేకాక నిజాం రాష్ట్రమున చిరనివాసము గల్గియున్నవారు గాక బ్రిటిషు ఆంధ్రదేశమునుండి వలసవచ్చినవారిసంఖ్యకూడ ఈపట్టికయందు చేర్పబడలేదు. సరియైన సంఖ్యలు దొరకకపోయినప్పటికి నిజాంరాజ్యమునందన్ని ప్రాంతములలోను వలసవచ్చినవారు కొన్ని లక్ష లుందురని తలంపవచ్చును; కనుక వారిని గురించి కొంచెం వివరంగా వ్రాస్తున్నాను.

ఈ తెలంగానాకును, ఆంధ్రదేశమునకును రాజకీయపు సరిహద్దులు తప్ప నైసర్గికముగా నెట్టి సరిహద్దులును లేవు; ఏకజాతీయులైన ఈరెండు దేశస్థులను ప్రకృతి ఎంతమాత్రమును విడదీయుటలేదు. ఇరుదేశములవారు వేరువేరు ప్రభుత్వములక్రింద నున్నను మొత్తముమీద అందరును ఆంధ్రౌన్నత్యము వాంఛించి కృషిచేయవలసినవారై యగుచున్నారు. పైకారణము లన్నిటిచేతను హిందూదేశమునందలి మిగిలిన అన్నిప్రాంతములకన్న నిజాంరాష్ట్రమునకు ఆంధ్రులు ఎక్కువగా వలసవచ్చుచున్నారు. అందులోను గుంటూరు, కృష్ణా, గోదావరీజిల్లాలవారు అధిక సంఖ్యాకులు. ఈవచ్చువారియందు ముఖ్యమైనవారు మూడురకములు. ఉద్యోగములకొరకు వచ్చువారు, చదువుకొనుటకు వచ్చువారు, వ్యవసాయముకొరకువచ్చువారు. వీరుగాక చిన్న చిన్న వ్యాపారముల కొరకు, పౌరోహిత్యము మొదలైన ప్రత్యేక వృత్తులకొరకు వచ్చువారుగూడ కొందరు గలరు.

దీనికి కారణ మేమనగా: ఆంధ్రదేశమునకు రాజధానీనగరము లేకపోవుట, ఉన్న వున్నతోద్యోగములన్నీ ఇతర్లు ఆక్రమించుకొనుట, ఎంత చదువుచదివినను ఆంధ్రులకు ఆంధ్రదేశమున తగిన వుద్యోగములు లభించుటలేదు. ఇంతేకాక, ఇదివరకు నైజాంరాష్ట్రమునందు విద్యాధికులు చాల తక్కువగుటచే వలసవచ్చిన విద్యావంతులగు ఆంధ్రు లందరికిని చాలాభాగము గవర్నమెంటు వుద్యోగములే దొరుకుచుండెడివి.

కాని ఇప్పుడు ఇక్కడకూడా హిందువులలోను, యెక్కువగా మహమ్మదీయులలోను వున్నతవిద్యావంతులు తయారగుచుండుటచే, క్రొత్తగా ముల్కీవుద్యమము ఒకటి బయలుదేరుటచేతను యిప్పుడు వుద్యోగములకొరకు వచ్చినవారికి యేప్రైవేటు కంపెనీలయందో తప్ప సర్కారు వుద్యోగములు దొరుకుటలేదు. ఇక చదువుకొనుటకు వచ్చువారి విషయము ఆంధ్రదేశమున విస్తీర్ణమునకు తగినన్ని కళాశాలలు లేకపోవుటచేతను, వున్నవి కూడా అందరికి అందుబాటులో లేకపోవుటచేతను, అదొరికిన విద్యయైనను చాలా ప్రియముగా నుండుటచేతనూ, చాలామంది యేబంధువుల ఆసరాయో చూచుకొని విద్య కొరకు కూడా కొందరు ఆంధ్రులు వలసవచ్చుచున్నారు. కాని యిప్పుడు అన్నిశాఖలలోను వురుదుభాషలోనే బోధించునటుల చేయుటవల్లను కాలేజిలకు కూడా "ముల్కీసర్టిఫికెట్టు" అవసరమగుటచేతను చదువుకొరకు వచ్చుటకూడా నిష్ప్రయోజనము అగుచున్నది.

"ఇక మూడవది వ్యవసాయమునకు వచ్చువారి విషయము" నిజాంరాష్ట్రమునందలి జిల్లాలలో అనేకవేల యెకరముల భూమి భూమిపన్ను యెక్కువగా నుండుటవల్లను అనుకూలమైన నీటివసతి లేకపోవుటవల్లను దున్నువారు లేక బీడుపడి వున్నది. ఇప్పుడు ప్రస్తుతనైజాముగారు పాలనమునకు వచ్చినతదుపరి చాలాభాగము

భూమి సేద్యమునకు యోగ్యమగునట్లు వర్షపునీరు నిలువచేయుటకై విశాలమైన చెరువులను నిర్మించి ప్రాజక్టులను కట్టించి పంటకాలువలను త్రవ్వించి చాల వసతి కలుగచేయుచున్నారు. "గనుక కొందరు ఆంధ్రులు ఆప్రదేశములను ఆక్రమించి భూమి సాగుచేయుటకొరకు వలసవచ్చుచున్నారు"

అందులోను కృష్ణాగోదావరీజిల్లాలవారే ఎక్కువగా తమకు సమీపమున నున్న సరిహద్దుగ్రామములయందు భూములను కొని సేద్యము చేయుచున్నారు. ఇంతేగాక నిజాంరాష్ట్రపురైతులకంటె కొంత విద్య నేర్చియుండుటచేతను, విశేషప్రయాసల కోర్చి పరదేశములకు వచ్చిన కారణముననూ, వీరు మిక్కిలి జాగ్రతగాను, చురుకుగాను పని చేసి వృద్ధిలోనికి వచ్చుచున్నారు. తెలంగానారైతులలో విద్య బొత్తుగా లేకపోవుటచేతను, నూతనమార్గములను తెలిసినవారు కాకపోవుటచేతను, గ్రామోద్యోగుల మాయలకు లోబడి చాల వెనుకబడియున్నారు. ఇది యిట్లుండగా ఈమధ్య కొందరు దూరాలోచన లేనివారు ఈబ్రిటిష్ఆంధ్రుల ఆక్రమణవల్ల తమ కేమో నష్టం కలుగుతుం దని కూడ తలంచుచు వచ్చారు. కాని నిజం విచారించితే ఇందులో ఏమాత్రం నష్టం లేకపోవడమే కాక అనేకలాభములుకూడ వున్నవి. ఏమనగా? నిజాంరాష్ట్రము ఇందలి అనేకగ్రామములు ముఖ్యముగా తెలంగానా ప్రాంతమున విస్తీర్ణమునకు తగిన జనసంఖ్య కలిగియుండలేదు. ఈకారణముచే నక్కడి పరిశ్రమలు తగినంత వృద్ధి బొందుటలేదు. ఇంతేగాక ఖాళీగా యీవున్న ప్రదేశములలో వారు ప్రచారము చేసి ఆంధ్రులను రాకుండా చేసినను మరేప్రాంతస్తులైనా వచ్చి ఆక్రమించుకొనవచ్చును; కనుక ఆఆంధ్రులనే రానిచ్చినచో అందరూ గలసి సక్రమమైన హక్కులను గూడ ననుభవింపవచ్చును.

ఏది ఎలా ఉన్నప్పటికి ఉభయులయందు అన్యోన్యస్నేహం సానుభూతి ముఖ్యంగా కావలసినవి. ఇక ఇతరరాష్ట్రములకు, ముఖ్యముగా బర్మా, మలయా దక్షిణాఫ్రికా మొదలగు విదేశములకు వలసబోయిన ఆంధ్రుల స్థితి ఇంతకన్నా అధ్వాన్నముగా నున్నది. ఆంధ్రరాష్ట్రమే కనుక లభించితే ఈవలస కొంతవరకు తప్పించవచ్చును; కనుక ఆంధ్రరాష్ట్రంకోసం ఆందోళన చేసేవారు ఈవిషయము కూడ మనసులో పెట్టుకొని సత్వరరాష్ట్రసిద్ధికి ప్రయత్నించవలసివున్నది.

## కవులకూ వ్యాసకర్తలకూ విన్నపం

ప్రబుద్ధాంధ్రకు ఎవరూ పద్యాలు పంపవద్దు. కథలూ, ఏకాంకనాటికలూ, వ్యాసాలూ, విమర్శలూ వచనంలోనే కావాలి. విషయం ఏమయినా పనికివస్తుంది. అయితే, సాధ్యమైనంత చిన్నవిగా వుండడం మంచిది. ఆంధ్రవాఙ్మయానికీ, ఆంధ్రజాతీయతకూ, ఆంధ్ర దేశానికీ, ఆంధ్రోద్యమానికీ, ఆంధ్రరాష్ట్రప్రయత్నాలకూ సంబంధించిన రచనలకు ప్రాముఖ్యం ఇస్తాము. భాష గ్రాంథికమైనా వ్యావహారికమైనా సరే కర్తలయిష్టం; గాని రచన మాత్రం సులభంగానూ, సాఫీగానూ, పొంకంగానూ వుండాలి. కవులు, చిత్రకారులు, గాయనీగాయకులు, నటీనటులు, శిల్పులు, పండితులు, వాణిజ్యనిపుణులు, పారిశ్రామికులు, ఉద్యమనిర్వాహకులు, త్యాగమూర్తులు—ఇలాంటివారిని గురించిన స్కెచ్చిలు సచిత్రంగా కావాలి. ఫిలిములు—వాటి డైరక్టర్ల బుద్ధికుశలత (తెనుగువారివే) చర్చించే వ్యాసాలున్నూ కావాలి.

కర్తలకు, వారి రచన పడిన సంచిక మొదలు పన్నెండు సంచికలు పంపుతాము. తరుచు రాసేవారికెప్పుడూ పంపుతూ వుంటాము. సంపాదకుడు

## రెవ్యూకోసం పుస్తకాలు

ప్రబుద్ధాంధ్రకు, రెవ్యూనిమిత్తం పుస్తకాలు పంపేవారు రెండేసి ప్రతులు—ఒకటి రెవ్యూ చేసేవారి నిమిత్తమూ మరొకటి పత్రికాభాండాగారం నిమిత్తమూ పంపాలి. ఒక్కప్రతే వచ్చే పుస్తకాలు రెవ్యూ చెయ్యబడవు. రెవ్యూలు సమర్థులచేతనే రాయిస్తాము; కాని యెలాంటి పరిస్థితులలోనూ వాటిమీద జవాబులూ పునర్విమర్శలూ ప్రకటించము.

సంపాదకుడు

## చందాదార్లకు విన్నపం

పాతచందాదార్లు తమ అడ్రెస్సులు మారితే తెలియపరచవలసిం దని కోరుతున్నాము. వారికి చందా అయేదాకా పత్రిక పంపుతాము. చేరనివారు మాకు తెలియచేయాలి.

మానేజరు
ప్రబుద్ధాంధ్ర ఆఫీసు—రాజమండ్రి

# వ్యాఖ్యానములు

## ఇతి విముఖో రాజా నిష్క్రాన్తః

శ్రీ బొబ్బిలిరాజా గారు జస్టిస్సుపార్టీలోనుంచి యివతలికి వచ్చేశారు.

అసలు, రాజకీయాలలోనుంచే వారు తప్పుకున్నారు.

ఈవిషయం యే వొక్కరికయినా తెలవకపోతుం దేమో అని, వారు, దఫాదఫాలుగా పత్రికలలో ప్రకటింపించారు.

మంచిదే.

సాలీనా పదిపదిహేను లక్షల ఆదాయం వచ్చే సంస్థానాధిపతి యిలాగ బయటి గొడవలు దులిపేసుకోవడం అందరికీ శ్రేయస్కరమే.

అయితే; ఈ జమీందార్లు, తమతమ సంస్థానాల్లోనే చెయ్యవలసిం దెంతో వుండగా అదంతా విడిచిపెట్టి జనసామాన్యానికి సంబంధించిన రాజకీయాల్లో యెందుకూ ప్రవేశించడం!

శాసనసభలలో తమకి ప్రాతినిధ్యం యేర్పడివున్నది కనక వాటిలో ప్రవేశించి, తమకి సంబంధించిన విషయాలలో మాత్రమే కలగజేసుకుంటూ, తక్కిన తమ కాలం అంతా—తమ ప్రతిభ అంతా—తమ రాజ్యతంత్రప్రావీణ్యం అంతా ఆశాసనసభల వరివడిలో తమతమ సంస్థానాలలోనే యెందుకు వినియోగించుకోగూడదూ?

ఒకచోట లక్షణంగా రాచరికం చెలాయిస్తూ వుండిన తాము, మరొకచోట మంత్రిత్వం నిర్వహించడం యేమంత ఘనతా?

ఇంతకీ:

రాజాగారిప్పుడిలా యెందుకు చెయ్యవలసి వచ్చిందీ?

పార్టీయొక్క యిప్పటి పాలసీ తమకి నచ్చలేదని వారు సులభంగా అనేశారు.

అయితే: పాలసీలో అంత దారుణమైన మార్పు కలగడానికి కారణం యేమిటీ?

తిరిగితిరిగి నెపం తమ మీదే పడిపోతున్నదని వారు గ్రహించుకోలేదు.

ఇప్పుడిలాగ—ఈ కారణంతో తాము విరమించుకోవడం, రాజకీయాలకూ జస్టిస్సుపక్షానికిన్నీ కాక తమకే మంచిది కాదని కూడా వారు గుర్తించుకోలేదు.

కాని యేవొక్కరికోసమూ రాజకీయాలు నిలిచిపోవు. ఇంతమాత్రాన జస్టిస్సుపక్షమున్ను అకాలమృత్యువువాత పడిపోదు.

నిజంగా జస్టిస్సుపక్షం వుండితీరవలసిన పక్షం.

రమారమీ నాలుగున్నరకోట్ల జనసముదాయానికి సౌభాగ్యమో దౌర్భాగ్యమో తప్పకుండా కలిగించగల గొప్ప సంస్థ అది.

మద్రాసుప్రెసిడెన్సీలో దానికి మంచి భవిష్యత్తున్నది.

కాని యీ సంగతి రాజాగారు పసికట్టలేదు.

త్యాగరాయశెట్టిగారి తరవాత—పానుగంటి ప్రభువు తరవాత ఆపక్షానికి తగిన నాయకుడు దొరకలేదు.

కొద్దికాలంలోనే ముగిసిపోవడంవల్ల మునిస్వామినాయుడుగారి నాయకత్వం దాన్నెలా నడిపించివుండునో చెప్పడానికి సాధ్యం కాదు; గాని బొబ్బిలిరాజాగారి హయాములో మాత్రం అది పెద్ద దెబ్బ తిన్నది.

నాలుగుకోట్ల పైచిలుకు బ్రాహ్మణేతర్ల సుస్థిరాస్త్రా నంటూ పుట్టుకువచ్చిన జస్టిస్సుపక్షమే పడిపోతే యీప్రెసిడెన్సీలో బతకడానికి మరేపక్షానికి కర్హత వున్నదీ?

నిజానికి, జరిగిన సంగతులను పట్టి చూస్తే రాజాగారి ప్రతిభ అనన్యసామాన్యంగానే కనపడుతుంది. పట్టుదల కూడా అసాధారణంగానే కనపడుతుంది. పరిశ్రమ సైతం అపరిమితంగానే కనపడుతుంది.

కాని, వారు, ఈ ప్రెసిడెన్సీలో జస్టిస్సుపక్షం పుట్టడానికి గల సన్నివేశా లేమిటో బోధపరుచుకోలేదు.

దీంతో, వారి ప్రతిభా, పట్టుదలా, పరిశ్రమా తప్పుదారిలో పడిపోయినవి.

అంతా వ్యర్థం అయిపోయింది.

చివరికి విషమించుకూర్చుంది.

ఏతావతా!

జస్టిస్సుపక్షం అపజయం పొంది రెండేళ్లయింది.

నిన్నటిదాకా ఆపక్షానికి రాజాగారి నాయకత్వమే అమల్లో వుండింది.

తమకు నచ్చిన పాలసీనే తామే అమలుజరిపిన యీరెండేళ్లలోనూ దాని పునస్సృష్టికోసాన్ని గురించి వారు నడిపించిన కార్యక్రమం యేమిటీ!

ఇన్నాళ్లదాకా మహాసభను సమావేశపరచకపోవడానికి హేతు వేమిటీ!

జనసామాన్యంలో యెలాంటి శక్తి నిగూఢమయి వున్నదో, అది జస్టిస్సుపక్షానికే యెంత సన్నిహితమయి వుండినదో రాజాగారు ఆకళించుకోలేదు.

తామధికారంలో వుండినప్పుడు, ఎంతసేపూ అధికారుల సాహచర్యమే తమకి, తమ పక్షానికి ప్రాప్యంగా చూసుకున్నారే గాని ప్రజలు ఆరాధించతగ్గవారని వారు భావించుకోలేదు.

ప్రజల గోడు నివారించ తగ్గదని వారు వూహించుకోలేదు.

అసలు, వారి దృష్టికి ప్రజలు అందనే లేదు.

ఇటు బొబ్బిలికోటలో గాని, అటు మద్రాసు ట్రాన్సన్‌బాగులో గాని, పక్షసభ్యులకు కూడా ఆనేతలకు తమ దర్శనం అందుబాటులో వుండలేదని వారెరుగుదురా!

పార్టీ పక్షంగా ప్రముఖుల్లో వొకరయినా జిల్లాలలో సంచారం చేశారా?

పోనీ, పత్రికాముఖంగా నేనా వారు ప్రజలతో సంబంధం పెట్టుకున్నారా?

ఈయిరవయ్యో శతాబ్దిలో చేతిలో వార్తాపత్రికలు లేకుండా రాజకీయపక్షాన్ని నడిపినవారు ఒక్క బొబ్బిలిప్రభువు తప్ప మరొకరు కనపడరు.

జిల్లాజిల్లాకూ ఎన్నెన్నో వారపత్రికలయినా యేర్పాటు చెయ్యకలిగివుండగా ప్రెసిడెన్సీ మొత్తంమీద వుండిన వొక్క సమదర్శినీ బలవన్మరణం పొందుతూవుండగా వారు చూస్తూ చూస్తూ వూరుకున్నారు.

చివరికి జస్టిస్సుపత్రికను కూడా నిలిపివేశారు.

పైపెచ్చు, వారు, పక్షసభ్యులూ పక్షప్రముఖులూ, పక్షనాయకులైన తామూ కూడా ప్రతికూలపక్షానికి చెందిన పత్రికలకోసం యెదురుతెన్నులు చూస్తూ వుండిపోవలసిన పరిస్థితులు కల్పించారు.

ఇక జస్టిస్సుపక్షం యెలా నిలవగలుగుతుందీ?

నోటీసుల మూలంగా—పుస్తకాల మూలంగా—పత్రికల మూలంగా—వలంటీర్లద్వారా—వక్తలద్వారా—సమావేశాల రూపంగా ముంచుకువచ్చే కాంగ్రెస్సుపక్షాన్ని ప్రతిఘటించి జస్టిస్సుపక్షం యెలా నిలవగలుగుతుందీ?

ఎవరు గట్టిగా బల్ల గుద్దితే వారిదే న్యాయం, వారిదే ధర్మపక్షం అనుకునే జనసామాన్యం, చూపించే పత్రికా లేక, చెప్పే నాథుడూ లేక జస్టిస్సుపక్షం యేం చేసిందో, యేం చేస్తున్నదో, యేం చెయ్యదలుచుకుందో, అసలది యెవరికోసం పుట్టుకువచ్చిందో యెలా గ్రహించగలుగుతుందీ?

రాష్ట్రేతర్ల పన్నుగడలలో పడిపోకుండా యెలా నిలవగలుగుతుందీ?

ప్రధాననాయకులూ ప్రధానమంత్రులూ అయిన తాము, తమ బొబ్బిలిపట్నంలో—తమ కోటలోనే వుండగా "మీ రాజాగారిప్పుడు వూళ్లో లేరు తెలుసా? దేశంలో కూడా లేరు విన్నారా? ఇండియానే విడిచిపెట్టి వెళ్లి యూరపులో విహరిస్తున్నారు మీ రేమయినా యెరుగుదురా? ఎన్నికల సమయంలోనే మీ రంటే లేశమూ ఆదరాభిమానాలు లేనివారు, నెగ్గితే తరవాత మీసంగతి తలుచుకోనైనా తలుచుకుంటారా? ఎందుకు మోసపోతారూ? కానికార్డు ముక్కని చేయించింది మీరాజాగారు. అర్ధణా కవరు అణా చేయించింది మీరాజాగారు జాగ్రత్త" అని కాంగ్రెస్సుపక్షంవారు బొబ్బిలి గ్రామంల్లోనే ప్రచారం చెయ్యగలిగినప్పుడు జస్టిస్సుపక్షానికి పతనం సంభవించడం ఆశ్చర్యకరమా?

చెల్మ్స్‌ఫర్డుసంస్కరణశాసనంలో ౧౯౩౭ సంవత్సరం శాసనం ఇస్తున్న అధికారాలు లేకపోవడం నిజమే; కాని రైతులకూ, వర్తకులకూ, యినాందార్లకూ సమస్తమైనవారికీ రెవెన్యూ కచేరీలలో కలిగే యిబ్బందులు తొలగించడానికి ఎంత నిరంకుశవిధానంలో అయినా అవకాశా లుంటాయే? పైగా మాంటుఫర్డుశాసనం దాన్ని అడ్డుకోదే?

నీటిసప్లయి విషయంలో వ్యవసాయదార్లు వొళ్లుగుల్లచేసుకోకుండా వుండడానికి ఏపెద్ద అధికారి అయినా సాయపడవచ్చునే? ఏశాసనమూ అడ్డుకోదే?

రిజిస్ట్రారు కచ్చేరీలలో, సివిలుకోర్టులలో, పోలీసుస్టేషన్లలో, మునిసిపాలిటీలలో, లోకలుబోర్డులలో ప్రజలుపడే బాధలు తగ్గిస్తామంటే మాంటుఫర్డుశాసనం అడ్డుకోదే?

రెయిల్వేలలో జరిగే అక్రమాలు నివారించే ప్రయత్నాలకు ఏశాసనమూ అడ్డుతగలలేదే?

విద్యావిధానంలో చక్కని మార్పులు చాలావరకు తీసుకురావచ్చునే?

వీటిలో కొన్నిటిలో శ్రద్ధవహించినా వోటర్లు జస్టిస్సుపక్షాన్ని విడిచిపెట్టలేకపోదురే?

ఏదీ, అలాంటి పని జరిగిందేదీ?

ఇలాగ జస్టిస్సుపక్షాన్ని గురించి యెంతో జవాబు చెప్పవలసిన బాధ్యత గల బొబ్బిలిప్రభువు దాన్ని విడిచిపెట్టి వెళ్లిపోవడంలో యెంతమాత్రమూ సబబు లేదు.

అది వారికి గౌరవకారణం కాదు.

వారు జస్టిస్సు పక్షాన్ని సరిగా నడిపి వుంటే దానిపాలనీ తాము జలదరించుకోవలసినంత అసందర్భంగా కాదు, అసలే మారిపోయి వుండదు.

ఇప్పుడేమయిందీ?

"బొబ్బిలి రాజాగారు, జస్టిస్సుపక్షం నిండుబలంతో వున్నప్పుడు దాన్ని చేపట్టారు. అది కృశించిపోవడం చూసి విడిచిపెట్టేశారు. వారికి నిర్మాణసామర్థ్యం తక్కువ" అని ప్రతిపక్షులు చాటించడానికవకాశం కలిగింది.

పైపెచ్చు జనసామాన్యం అది నమ్మకుండా వుండడానికి తగిన సన్నివేశాలు లేవు.

ఎటు చూసినా ఏమీ బాగా లేదు.

రాజాగారు మంచిపని చెయ్యలేదు.

## కాంగ్రెస్సు దృష్టిలో ప్రజలు చలిచీమలైనా కారు

ముప్ఫయి అయిదువేల కాంగ్రెస్సు సభ్యులను తుడిచిపారేసిన డాక్టరు పట్టాభి సీతారామయ్యగారి ధైర్యసాహసాలు పూర్తిగా ప్రశంసించతగ్గవి; కాని గర్హించతగ్గవి కావు.

ఏమంటే?

మూసుకుపోయి వున్న కళ్లు తెరచి, ప్రజలకు, నిగూఢమైన వొక సత్యాన్ని అవి వెల్లడిచేస్తున్నవి.

"బ్రిటిషు అధికారివర్గానికే గాని, ఇండియా ప్రభుత్వం, ప్రజలకు బాధ్యత కనబరచడం లేదని నిందుస్తున్న కాంగ్రెస్సు తాను ప్రజలను చలిచీమలవలెగా అయినా చూడడం లేదు.

ఇదీ అసత్యం.

కాంగ్రెస్సిప్పుడు ఏ వొకరిద్దరి చేతుల్లోనో యిరుక్కు-పోయి వున్నది.

వారు దాన్ని పూర్తిగా స్వార్థాని కుపయోగించుకుంటున్నారు.

జనసామాన్యంలో వున్న అజ్ఞానం, వారి గారడీకార్య ప్రణాళిక వల్ల మరింత ఘనీభవించిపోయి, పెట్టని కోట అయి వారిని కాపాడుతున్నది.

కాంగ్రెస్సు అధికారివర్గం ఆవొకరిద్దరి కరుణాకటాక్షాలవల్లనే యేర్పడుతూ—అంచేత ఆకరుణాకటాక్షాలు తన యెడల చిరస్థాయిగా వుండిపోడానికి ఆవొకరిద్దరి చుట్టూరానే తిరుగుతూ—అమాయకులు కలపడి, బ్రిటిషుగవర్నర్లు కూడా కనివిని యెరగని నిరంకుశ విధానాలతో రాష్ట్రాలలో ప్రచండతాండవం చేస్తున్నది.

ఇలాంటి స్థితిలో ఆకాంగ్రెస్సుని నమ్మి, దానికి పాలుపోసిన అమాయిక ప్రజలు కుక్కి-న పేలయి వుండడం తప్ప మరేం చెయ్యగలరూ!

ఇదే నిజం కాకపోతే, పట్టాభిసీతారామయ్యగారు అన్ని వేల సభ్యుల స్వత్వాల నెలా భగ్నం చెయ్యగలిగి వుండురూ?

అసభ్యుల తప్పేమిటీ?

వారు కాంగ్రెస్సు సభ్యులు కావడానికి తగిన అర్హతలు లేని వారా!

వారు, నిర్ణీతమైన చందా పూర్తిగా చెల్లించలేదా?

ఆచందా నిర్ణీతకాలానికి ముందే చెల్లించబడలేదా?

పట్టాభిసీతారామయ్యగారిలాంటి దోషా లేమీ చూపించలేక పోయారు.

పోతే, అసభ్యులు చెల్లించిన చందా డబ్బు బాంకిలో జమకట్టని దోషం జిల్లాసంఘంవారిది కాని, సభ్యులది కాదే?

అందు కేమి శిక్ష తగునో అది జిల్లాసంఘం మీద విధించాలి; గాని అసభ్యులమీద రుద్దడాని కెవరికీ యెలాంటి అధికారమూ లేదే?

కాని, పట్టాభిసీతారామయ్యగారు, సాహసించి అసభ్యులమీదే బ్రహ్మాస్త్రం విడిచిపెట్టారు.

దీనివల్ల అసాధారణసభ్యులు "మామాట యేమి చెబుతా" రని జిల్లాసంఘాధికారి వర్గంమీద తిరుగుబాటు చేసి అస్తవ్యస్తం చేసేస్తా రనీ—తద్వారా దానిబలం సన్నగిల్లిపోయి పొరుగు ప్రాంతం కాకతప్ప దనీ —ఇలాగ పట్టాభిసీతారామయ్యగారు రండు ఫలాలు ఆశించి వుంటారు.

అయితే, పశ్చిమకృష్ణాజిల్లాసంఘాధికారి వర్గంవారిలో కూడా ధైర్యసాహసాలు తక్కు-వగా లేవు.

ఆత్మవిశ్వాసం కూడా వారిలో సమధికంగానే వున్నట్టు కనబడుతుంది.

కనకనే వారు, మొదట, జరిగిన సంగతు లన్నీ పూర్తిగా—స్పష్టంగా—నిర్మొగమాటంగా వెల్లడిచేసేసి దేశంలో తమ నిర్దోషితను రుజూవుపరుచుకున్నారు.

తరవాత ఈవిషయం అఖిలభారతకాంగ్రెస్సుసంఘం యెదట విచారణకు పెట్టి పరిస్థితు లన్నీ విశదపరుచుకున్నారు.

దీంతో, దాన్ని నడుపుతున్న ఆవొకరిద్దరూ తప్పెవరిదో తెలుసుకోక తప్పింది కాదు.

ఒప్పుకోకా తప్పింది కాదు.

కాని. లోకంలో తన తప్పు తెలిసినవాడు—ఒప్పుకున్నవాడు అందుకు తగినట్టు మసులుకోడానికి బదులుగా మరొక తప్పుదారి తొక్కడం మనం చూస్తున్నాము.

ఆ వొకరిద్దరి చేతుల్లోనూ వున్న ఆ అధికారవర్గం అలాగే చేసింది.

"వెళ్లి మీరాష్ట్రసంఘం దగ్గిరే మొరపెట్టుకో" అని జిల్లాసంఘాన్ని మందలించింది.

ఏం?

రాష్ట్రసంఘం అక్రమం చెయ్యకపోతే జిల్లాసంఘం తనదాకా వచ్చి వుంటుందా?

ఫిర్యాదీని "వెళ్లి ముద్దాయితో చెప్పుకో" మనడంలో యేమి సబబున్నది?

దీనివల్ల కాంగ్రెస్సుకి కావలసింది దబాయింపుశక్తి కాని సత్యం కాదనీ, "అహింస" అనే మాటనే అది గౌరవిస్తుంది కాని దాని భావాన్ని కాదనీ తేలిపోయింది.

తప్పు జిల్లాసంఘానిదే అయితే దాన్ని విడిచిపెట్టి సాధారణ సభ్యులను—ముప్పయి అయిదువేలమందిని చలిచీమలు కంటే నికృష్టంగా చూడడం తక్కు-వ నేరమా?

రాష్ట్రసంఘం ధర్మబద్ధంగానే ప్రవర్తించివుంటే దాన్ని రచ్చకీడ్చిన జిల్లాసంఘాన్ని సుఖసుఖాల విడిచిపెట్టడం న్యాయమేనా!

అయితే, జిల్లాసంఘాన్ని శిక్షించడానికి ఎవరికీ దమ్ము చాలింది కాదని మేము దృఢంగా చెప్పగలం.

ఇక వున్న దల్లా యేమిటంటే?

కాంగ్రెస్సు అధ్యక్షపదవికి సంబంధించి సుభాసబోసుగారు చేసిన రెండో స్టేటుమెంటు అసాధారణమైన వొక రహస్యం బయటపెడుతున్నది.

అదేమిటంటే?

పట్టాభిసీతారామయ్యగారు తమపేరు కాంగ్రెస్సు అధ్యక్షపదవికి సూచించబడినందుకు ఆశ్చర్యచకితులైపోయారట. తరవాత, వారు, తమపేరు ఉపసంహరించుకోడానికి సిద్ధపడ్డారుట; కాని వర్కి-ంగుకమిటీసభ్యులు కొందరు వారిని అలా చెయ్యవద్దని అడ్డుచేసి పోటీకి నిలిపారుట.

అంటే ఏమి తేలింది ?

ఆ "పౌరవీరులకి" మళ్లీ సుఖాసనాసీనులుగా రక్షకులు కావడం సుతరామూ యిష్టంలేదు.

ఆయనను ఓడించడానికి వారు పట్టాభిసీతారామయ్యగారిని సాధనంగా చేసుకున్నారు.

ఇలాంటి స్థితిలో, పశ్చిమకృష్ణాజిల్లా తగువుసందర్భంలో యేదో విధంగా వారిని వొడ్డెక్కించకపోతే యెలాగా ?

నిర్దోషులైన—అమాయికులైన ముప్ఫయి అయిదువేల సభ్యులను నిర్దాక్షిణ్యంగా యెగరగొట్టేసినవారని తామే నిర్ణయించేస్తే వారిని అధ్యక్షతకు ప్రతిపాదించడం యెలాగా ?

కాంగ్రెస్సులో యింత సత్యం వున్నది. ఇంత ధర్మం వున్నది. ప్రజలంటే యింత లక్ష్యం వున్నది. బాధ్యత అనే మాటకి యిలాంటి అర్థం వున్నది.

సెబాస్ !

## ఇది ఫలించదు. మంచిదిన్నీ కాదు

హైదరాబాదులో కూడా అగ్ని రవిలింది.

మన ఆంధ్రులున్నూ కొందరందులో వురికారు.

"దేశసేవే మా ముఖ్యవృత్తి. స్వాతంత్ర్యశంఖారావం విన్న తరవాత కూడా మేము స్తంభులమై పడి వుండలే" మంటూ మహోద్రిక్తులై వురికి, వారు, తీవ్రనిర్బంధాల పాలయినారు.

శరీరం గగుర్పొడిచే సన్నివేశం అది.

ఉత్సాహం పురకలు వేయించే భేరీనినాదం అది.

వారి ఆత్మగౌరవవిశ్వాసాలూ, వారి ధైర్యసాహసాలూ తలచుకుని మేము సంభ్రమిల మవుతున్నాము.

అయితే :

వారి స్థితిగతులిందు కనుకూలంగా వున్నాయా ?

వారి యీమహోత్సాహానికి పునాది యేమైనా వున్నదా ?

ఈత్యాగం వారి జాతీయత నేమయినా దృఢపరచగలదా ?

సాటి అన్యజాతీయులయెదట, వారు, సంఖ్యకు తగిన పదవి అనుభవిస్తున్నారా ?

ఈ మహోద్యమంలో వారు ప్రవర్తకులలో లెక్కా అనుచరులలో జమా ?

ఈవిషయం యెత్తుకునేటప్పటికి మాకే ప్రశ్నలు గతినిరోధం కలిగిస్తున్నాయి.

వీటికి సంతృప్తికరాలైన జవాబులు రావాలంటే యీ కింది అంకెలు బాగా గమనించాలి.

నిజాంరాష్ట్రం మొత్తం వైశాల్యం ౮౨,౬౯౮ చదరపు మైళ్లు. మూడు దేశాల తాలూకు ముక్కలు కలిసి నిజాము రాష్ట్రమూ, యీ మొత్తమూ అయింది.

ఇందులో చేరివున్న తెలంగానా—అంటే తెనుగుదేశ ఖండవైశాల్యం ౪౧,౫౦౭ చదరపు మైళ్లు. మరాట్వాడీ—అంటే మహారాష్ట్రదేశ ఖండవైశాల్యం ౪౧,౧౯౬ చదరపు మైళ్లు.

కన్నడదేశఖండం మరాట్వాడీలో చేరిపోయి వున్నది.

నిజాం రాష్ట్రం అంటే మొత్తం ౧౬ జిల్లాలు. ఇందులో తెనుగు జిల్లాలు ౯. కన్నడ మరాట్వాడీలు కలిసి యెనిమిది.

నిజాం రాష్ట్రం మొత్తం జనసంఖ్య ౧,౪౪,౩౬,౧౪౮

| | |
|---|---|
| ఇందులో ఆంధ్రులు | ౬౯,౭౨,౫౩౪ |
| మహారాష్ట్రులు | ౩౭,౮౬,౮౩౮ |
| కన్నడులు | ౧౬,౨౧,౦౯౪ |
| ముస్లిములు | ౧౫,౩౪,౬౬౬ |

తక్కినవారి సంఖ్య యిక్కడ అనవసరం. ఏమంటే ? వారు ప్రభుజాతివారూ కారు. దేశీయులూ కారు.

రాష్ట్రం మొత్తంమీద ౧౬ భాషలున్నవి. అందులో ఒక్క మన ఆంధ్రులు డెబ్బయి లక్షలుండగా తక్కిన పదిహేను భాషలవారూ కలిసి ౭౪ లక్షలున్నారు.

రాష్ట్రం మొత్తంమీద తొమ్మిది మతాలున్నవి

| | |
|---|---|
| అందులో హిందువులు | ౧,౨౧,౭౬,౭౨౭ |
| వారిలో మన ఆంధ్రులు | ౬౯,౭౨,౫౩౪ |

మతాలను [illegible] చూసినా అందరిలోనూ పెద్ద సంఖ్య మన ఆంధ్రులదే.

ఇక రాష్ట్రంలో మనవారి పదవి.

నిజంగా, ఆంధ్రుడైనవాడికి, ఈవిషయం యెత్తుకుంటే సిగ్గు కలుగుతుంది.

ఎందుచేతనంటే ?

ప్రకృతప్రభువంశం మూలపురుషుడు అసఫ్‌జా నిజాముల్ముల్కు. అతను తానీషాను జయించి గోల్కొండరాజ్యం స్వాధీనపరచుకున్న ఔరంగజేబు పాదుషా దక్కన్ ప్రతినిధి. కొంతకాలమైన తరవాత ఢిల్లీపాదుషాను తిరస్కరించి అతను స్వతంత్రుడైనాడు.

ఓరుగంటిసామ్రాజ్యం కూలిపోయి, దేశం అంతా ముస్లిముల వశమయిపోయింది. ఇది హిందువులైనవారందరికీ సమానమైన లజ్జాకారణమే : కాని అమస్లిం ప్రభువులు తమకు మంత్రులనూ. సేనాధిపతులనూ మన ఆంధ్రులలోనుంచే తీసుకోవలసివచ్చింది.

అక్కన్న మాదన్నగార్ల పేర్లెరగని ఆంధ్రు లెవరూ లేరు. చాణక్యుని తరవాత రాజ్యతంత్రనైపుణ్యంలో చెప్పుకోతగ్గవారు వారిద్దరే. గోల్కొండనవాబులలో చివరివాడయిన తానీషాకు వారిలో అక్కన్న సర్వసేనాధిపతీ, మాదన్న ప్రధానమంత్రీనీ.

గోల్కొండకోట ముట్టడించిన ఔరంగజేబుపాదుషాను, వీరు, ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్లూ తాగించారు.

అయితే, లంచం తిన్న సర్దారుల తాబేదారులు విని తానీషా భార్యలు ఢిల్లీపాదుషా మతం పేరుచెప్పి యుద్ధానికి వచ్చాడని నమ్మి

అతనికి అనుగ్రహం కలుగుతుం దని అలించి, అక్కన్నమాదన్న లను కోటలోనే రహస్యంగా చంపి, వారి తలలు డిల్లీఫాదుషాకు పంపించారు.

దాంతో ఫాదుషాపని చులకన అయింది. అతను జయించాడు. గోల్కొండరాజ్యం ఆక్రమించాడు.

అంతే.

తరవాత ఆంధ్రజాతి కూలిపోయింది. నేటివరకూ మళ్ళీ కోలుకో లేదు,

ఇప్పటి నైజాముగారు ఎక్జిక్యూటివుకౌన్సిల్ సాయంతో రాజ్య పరిపాలన చేస్తున్నారు. ఆకౌన్సిలులో మంత్రులు ఏడుగురు. వారిలో వొకరు మహారాష్ట్రులు. ఆంధ్రు డొక్కడూ లేడు. రాష్ట్రంలో నాలుగు సుబాలున్నవి. నాలుగు సుబాలమీదా నలుగురు సుబేదార్లున్నారు. వారిలో వొకరు మహారాష్ట్రులు. ఆంధ్రు డొక్కడూ లేడు.

తాలూక్దార్లు — అంటే జిల్లాకలెక్టర్లు ౧౭ గురు. వారిలో వొకరు మహారాష్ట్రులు. ఆంధ్రు డొక్కడూ లేడు. డిప్టీకలెక్టర్లలో మాత్రం వొక్క ఆంధ్రు డున్నాడు.

హైకోర్టులో న్యాయమూర్తులు ౮ గురు. వారిలో వొకరు మహారాష్ట్రులు. ఆంధ్రు డొక్కడూ లేడు. తాలూకాలు సుమారు ౧౮౦ అంటే అందరు డిస్ట్రిక్టుమున్‌సిఫ్‌లున్నారు; అయితే వారిలో వొకరో యిద్దరో మాత్రమే ఆంధ్రులు.

జుడిషల్‌కమిటీ (హైకోర్టుమీద అప్పీలుకోర్టు) లో ఆంధ్రులొకరున్నారు. పోలీసు జిల్లాసూపరెంట్లు ౧౭ గురు. వారిలో వొక్కరు మాత్రమే ఆంధ్రులు.

చిల్లరి వుద్యోగాలలో చాలా మంది మహారాష్ట్రులు కొంచెం పెద్ద పదవులలో వున్నారు. ఆంధ్రులు చాలా తక్కువ.

ఆఫీసర్ల విషయంలో యిలా వున్నా ప్లీడరీ మొదలైన స్వతంత్ర వృత్తులలో కూడా మస్లిముల తరవాత మహారాష్ట్రులే యెక్కువగా వున్నారు. ప్రముఖులుగా కూడా వారే వున్నారు. ఆంధ్రులు సామాన్యులుగానే వున్నారు.

నిజాంరాష్ట్రంలో బాంకర్లందరూ ఆంధ్రేతరులు. పెద్దపెద్ద వర్తకులు కూడా ఆంధ్రేతర్లే. మిల్లుఓనర్లు కూడా చాలామంది ఆంధ్రేతర్లే.

ఏం ?

ఎక్కువ సంఖ్య గల ఆంధ్రులు, తమలో సగమే వున్న మహారాష్ట్రులకంటే యెందుకు తీసికట్టుగా వున్నారూ ?

కన్నడులు వొక్క మైసూరిలో తప్ప, మద్రాసుప్రెసిడెన్సీలోనూ అల్పసంఖ్యాకులే. బొంబాయిప్రెసిడెన్సీలోనూ అల్పసంఖ్యాకులే. నిజామురాష్ట్రంలోనూ అల్పసంఖ్యాకులే.

నిజానికి నైజామురాజ్యంలో కూడా వారి స్థితి అధ్వాన్నంగానే వున్నది.

అయితే, ఇక్కడ వారి ప్రశక్తి లేదు.

పోగా, యిక అరవలు.

నిజామురాష్ట్రంలో ప్రభుజాతివారు మస్లిములు. అధికసంఖ్యాకులు ఆంధ్రులు. వారు దేశీయులే. తరవాతి సంఖ్య మహారాష్ట్రులది. వారు కూడా దేశీయులే. వారిసంఖ్యకంటే చిన్నసంఖ్య కన్నడులది. వారున్నూ దేశీయులే.

ఇలాగ ప్రభుజాతివారూ కాక, దేశీయులూ కాక అరవలుకూడా నిజామురాష్ట్రంలో వున్నారు.

తక్కినవారిలాగే వారున్నూ ఆగంతుకులు. వారిసంఖ్య ౨౯,౦౫౦

ఆగంతుకులలో కూడా సంఖ్యను బట్టి చూస్తే అరవలు మూడో వారు.

కాని వారి పదవి చూడండి.

నైజాముగవర్న మెంటు అడ్వోకేటుజనరలు మొన్నటిదాకా వొక అయ్యంగారు.

సెంట్రల్‌జైయిల్ సూపరెంటు ఒక పిళ్లెగారు. వారిజీతం ౧-౨౦౦-౦-౦.

కాలేజీలో ప్రొఫెసర్లనేకులు అయ్యర్లు.

రాజ్యాంగసంస్కరణసూచనలు చెయ్యడానికి నైజాముగారొక కమిటీ యేర్పరిచారు. దాని అధ్యక్షు లొక అయ్యంగారు.

ఈ అయ్యంగారే శుద్ధాంధ్రసంస్థానమైన గద్వాల ప్రభువులకు ముఖ్యవకీలు.

గద్వాలలో డిస్ట్రిక్టుకలెక్టరు ఆంధ్రేతరుడు. జిల్లాజడ్జీ ఆంధ్రేతరుడు. మున్సిఫ్ ఆంధ్రేతరుడు. పోలీసు ప్రధానాధికారి ఆంధ్రేతరుడు.

ఇంతేందుకూ ?

నైజాముగారి ఎక్జిక్యూటివుకౌన్సిలు అధ్యక్షులూ ప్రధానమంత్రీ అయిన సర్. అక్బర్. హైదరీగారి సెక్రెటరీ వొక అయ్యరు. వీరికి జీతం నెలకి వెయ్యి రూపాయలు.

పెద్ద వుద్యోగాలలోనే అరవల ప్రాబల్యం యిలా వున్నప్పుడు వారి చేతిలో వుండే చిన్న వుద్యోగాల సంగతి యిక చెప్పడం యెందుకూ ?

మహారాష్ట్రులలో కూడా పెద్ద వుద్యోగస్థులు తమవారి సాయం వల్ల వస్తూన్నవారే. తమ ప్రజ్ఞవల్ల కూడా వస్తున్నవారే. వారి చేతిలో వున్న చిన్న వుద్యోగాలు కూడా తరుచు మహారాష్ట్రులకే దఖలుపడుతూ వుండడంలో వింత యేమీ లేదు.

ఇక ఆంధ్రుల మాట ?

ఆంధ్రులు అన్ని విషయాలలోనూ, అన్ని విధాలా యింత లిగాడుగా వుండడానికి కారణం యేమిటి ?

అంత దేశవైశాల్యమూ నిరుపయోగం అయిపోతున్న దేమి ? అంత సంఖ్యాధిక్యమూ వ్యర్థమయిపోతున్న దేమి ?

తమ మాతృదేశంలోనే వారు, తోటివారికంటే — చివరికి ఆగంతులకంటే అధమస్థితిలో వున్నారేమీ? ఖండాంతరాలనుంచి వలసవచ్చినవారికంటే కూడా వెనకబడిపోయి వున్నారేమీ?

శాసనాలు పరిశోధించినట్టు పరిశోధిస్తే గాని తేలని విషయం కాదిది.

మరేమిటంటే?

ఇక్కడి మన బ్రిటిషాంధ్రులలో వున్న జబ్బే అక్కడి నిజామాంధ్రులలోనూ వున్నది.

అది స్వస్థానవేషభాషాద్వైముఖ్యం.

ఎంతసేపూ పరులను అనుసరించిపోయే అవివేకం.

తమవారిని తూలనాడే — పరులను నెత్తికెక్కించుకునే భావదాస్యం.

అక్కడి మహారాష్ట్రులు తమ వేషం మానలేదు. తమలో తాము మహారాష్ట్రంలోనే మాట్లాడుకుంటారు. తమవారిని తీసేసుకోరు. అవకాశం వచ్చినప్పుడు తమవారినే చేరదీసుకుంటారు.

తమ పిల్లలను ఈగుణాలు నేర్పుతూ జాగ్రత్తగా తయారు చేసుకుంటారు.

వారు ముందు మహారాష్ట్రగ్రంథాలే చదువుతారు. మహారాష్ట్రపత్రికలే చదువుతారు.

బ్రిటిషిండియాలో వుండే మహారాష్ట్రపత్రికలు ఎప్పుడూ వారిని కంటికి రెప్పలాగ కాపాడుతూనే వుంటాయి. వారికి కర్తవ్యం బోధిస్తూనే వుంటాయి. అంచేతే నిజాంరాష్ట్రంలోకి రాకూడదని నిషేధించబడే పత్రికలలో తరుచు మహారాష్ట్రపత్రికలే యెక్కువగా వుంటాయి.

ఏదీ, యీలక్షణాలు మన ఆంధ్రులలో యేవీ?

అక్కడి మన ఆంధ్రులు చదువుకున్నవారంతా మస్లిముల వేషం వేస్తారు. వారు మస్లిములు కారనీ, ఆంధ్రులనీ అనుకోడానికేమీ ఆధారాలు కనపడవు. తమలో తాము వారెప్పుడూ వుర్దూలో మాట్లాడుకుంటూ వుంటారు. తమలో తాము తీసేసుకుంటూ వుంటారు. అవకాశం వస్తే తమవారినే చేరనివ్వాలనే సిద్ధాంతం వారెరగరు.

తమ పిల్లల విషయంలో వారు ఇలాంటి విషయాలలో శ్రద్ధ చూపించరు.

వారు వుర్దూగ్రంథాలే చదువుతారు. ఉర్దూపత్రికలే చదువుతారు.

బ్రిటిషుఆంధ్రపత్రికలు వారివిషయమే యెత్తుకోవు. వారూ వీటిని చూడరు.

ఇక్కడి మనపత్రికలకు మనవిషయం ప్రాధాన్యం కానేకాదు.

పైగా, మనకంటే అక్కడివారికి విద్యాసక్తి తక్కువ. పరిశ్రమ కూడా తక్కువ. దీక్షా, ఏకాగ్రతా లేనేలేవు.

నూతనాభిరుచులు లేవు. నూతనాశలు లేవు. నూతనసంకల్పాలు లేవు.

"అయ్యో, మన పని యిలా వుందే" అని ఆవేదనే లేదు.

ఈస్థితి, దౌర్భాగ్యమనిపించుకునే రెడ్లలో మరీ యెక్కువ. వారు ఆంధ్రభాష వినడానికే యిష్టపడరు. తమ పిల్లలకు ఆంధ్రభాష నేర్పించడానికి శ్రద్ధపట్టనేపట్టరు. అసలు, ఆవిషయం వారు స్మరించనే స్మరించరు, పిల్లలకు వారు మౌల్వీలచేత వుర్దూమాత్రం తప్పకుండా నేర్పిస్తారు.

దీనివల్ల అక్కడి ఆంధ్రులలో స్వవిషయం తెలవకపోవడం— స్వవిషయమై అభిమానం కలక్కపోవడం—పైగా పరసంస్కారమూ, పరులమీద తమమీద లేని ఆదరాభిమానాలు కలగడం— ఇలాంటి దుష్ఫలితాలు కలుగుతున్నవి.

ఇంతెందుకూ?

అక్కడ, మహారాష్ట్రులూ ఆంధ్రులూ వియ్యం అందడం అక్కడక్కడ వుంది. విశేషం యేమిటంటే? మహారాష్ట్రుణ్ణి పెళ్లిచేసుకున్న తెనుగుపిల్లా తెనుగు విడిచిపెట్టేస్తుంది. మహారాష్ట్రపిల్లని పెళ్లి చేసుకున్న తెనుగుపిల్లాడూ తెనుగు విడిచిపెట్టేస్తాడు.

ఇదిలా వుండగా,

ఇక్కణ్ణించి మన బ్రిటిషాంధ్రులు వెళ్లి అక్కడ కొన్ని లక్షలున్నారు.

వారిలో అనేకులు విద్యాధికులు. నవనాగరికులు.

కాని, వెనకబడి వున్న నిజామాంధ్రులను వారిలో చాలామంది అన్యజాతివారిని చూసినట్టు చూస్తారు. ఎగతాళి చేస్తారు.

అసలక్కడివారిలోనూ, అక్కడికి ఇక్కణ్ణించి వెళ్ళినవారిలోనూ సిక్కువేషాలు వేసుకు తిరిగేవారు కూడా కొందరున్నారు. ఒంగోలీలను విభ్రాంతిపరచేవారు కూడా కొందరున్నారు.

ఇలాంటి కారణాలవల్ల— ఇలాంటి దురలవాట్లవల్ల— ఇలాంటి సహజదౌర్బల్యంవల్ల అక్కడి ఆంధ్రులు పూర్తిగా వెనకబడిపోయి వున్నారు.

అక్కడ హీనజాతులవారైనా, ఉన్నతజాతులవారయినా ఇస్లాముమతంలోనూ, క్రిస్టియను మతంలోనూ కలిసే హిందువులలో నూటికి తొంభయిపాళ్లు ఆంధ్రులు.

ఇలాగ అక్కడి ఆంధ్రులు సర్వవిధాలా యింకా—యింకా వెనకబడిపోతూ వుండగా, అక్కడి ఆంధ్రమండలాలలో రాష్ట్రీయులైన మహారాష్ట్రులూ, కన్నడులున్నే కాక, అరవలూ, గుజరాతీలూ, మార్వాడీలూ, సైంధవులూ, సిక్కులూ, పంజాబీలూ, రాజపుతానావారూ మరికొందరూ ఆగంతుకులు ప్రాముఖ్యం వహిస్తున్నారు.

నిజామాంధ్రులకు ఇవి అర్థం కావు. ఇవి తోచవు. ఇవి కనపడనే కనపడవు.

ఇది తమకి అపకీర్తికరం అని వారికి తోనేలేదు.

జాతి అంతా యిలా కుళ్లిపోతూ వుండగా కొందరు యువకులు "దేశసేవే మాముఖ్యవృత్తి" అనడంలో యేమి అర్థం వున్నదీ?

"స్వాతంత్ర్యశంఖారావం విన్నతరవాత కూడా శ్రద్ధాళులమై మేము పడివుండలే" మని అభిమానపడడం అనుకరించడంలో సబబేమిటి?

అగ్గిలో వురకడం అసాధారణమైన పనే.

మహాశూరుడు కాని చెయ్యలేని పనే.

అయితే; అది తనకి తోచి చెయ్యాలి.

తనకి ఆవేదన కలిగి చెయ్యాలి.

తన హృదయం రెపరెపలాడిపోయి చెయ్యాలి.

ఈవుద్రేకం పరుల బోధనలవల్ల కాక—పరులను చూడడంవల్ల కాక స్వయంగా కలగాలి.

ఇప్పుడు నిజామాంధ్రులలో యిలాంటి ఆవేశం కలిగిందని మేము చెప్పలేము.

ఇక అది ఫలిస్తుందా ఫలించదా అని కాదు మాప్రశ్న.

మంచిదా చెడ్డదా అని కూడా కాదు మాప్రశ్న.

తరవాత — అంటే అది విజయం పొందితే అప్పుడున్నూ ఆంధ్రుని పదవి యేమిటి?

ఏమీ సందేహం లేకుండా — ఏమీ విచారం లేకుండా — ఒకరి వెనక — ఒకరి కనుసన్నల మెలగడమే.

అప్పుడున్నూ పదవులు వారివీ, పరవళ్ళు వీరివీనీ. ప్రయోజనాలు వారివీ, బాధలు వీరివీనీ. పేరు వారిదీ, సేవ వీరిదీనీ.

చివరికి తిరగ్నిషను వారి పాలూ. ద్వేషమూ — కసీ — పగా వీరి వంతూనూ.

మేము నిజామాంధ్రులలో కనపడుతున్న కదలికను ప్రశంసించలేము.

అభినందించలేము.

వారి ముందుతరంవారు కూడా వారిని పొగడలేరు.

వారి అభ్యుదయానికిది దారి కానేకాదు.

## రాజన్‌మంత్రి ఆర్యవిజ్ఞానవిద్వేషం

ఆర్యానార్యవిభేదం కల్పిస్తున్నారనీ, అమాయికప్రజల హృదయాలకు ఆవిషం యెక్కిస్తున్నారనీ, కాంగ్రెసుపక్షంవారు పన్నీరుశెల్వంగారిని నిందించడంలో సౌజన్యం యేమీ లేదు.

ఎంచేతనంటే?

అది వారి వొక్కరి తలనే పుట్టలేదు.

కాంగ్రెసుమంత్రిసత్తములూ, ఆర్యులతో వియ్యం అందిన రాజగోపాలాచారి కుడిభుజమూ అయిన డాక్టర్. రాజన్‌గారు చేస్తున్న ఘనకార్యం కూడా అదే.

అయితే;

కాంగ్రెసుపక్షానికి నోరున్నది. జస్టిసుపక్షానికి నోరు లేదు.

ఇంతే భేదం.

ఆయుర్వేదంపట్ల రాజన్‌మంత్రి కనపరుస్తున్న వైఖరి చూస్తూ వుండీన్నీ యీసంగతి గ్రహించలేకపోవడం అవివేకం.

పన్నీరుసెల్వంగారి ఆర్యద్వేషం ప్రచారదశలోనే వుంది; కాని రాజన్‌మంత్రిగారి ఆర్యద్వేషం ఆచరణదశకి వచ్చి నిర్ధూమధామం చేస్తున్నది.

"శిక్షణ" అనే గడ్డిపోచకు భయపడి కాంగ్రెసాంధ్రుల పత్రికలు దాన్ని బలపరుస్తున్నవి. అథవా, అసమ్మతిని ప్రకటించలేకుండా వున్నవి.

కాంగ్రెసుకే చెందిన బొంబాయి మంత్రులు తమ రాష్ట్రంలోని భిన్నభిన్న భాషాభూభాగాలలో మూడు ఆయుర్వేదవిశ్వవిద్యాలయాలు ప్రారంభించే ప్రయత్నంలో వున్నారు.

తక్కిన కాంగ్రెసుమంత్రాంగాలు కూడా తమతమ రాష్ట్రాలలో ఆయుర్వేదంపట్ల ఆదరగౌరవాలు ప్రకటిస్తూ సంస్కారాను రూపమైన చేయూత యిస్తున్నాయి.

కాని మద్రాసుకాంగ్రెసు మంత్రాంగం ఆయుర్వేదాన్ని నిరసిస్తున్నది. తీసిపారేస్తున్నది.

ఆసవారిష్టాలను మద్యజాతులలో చేర్చి, అది, ఆరకం ఔషధాలను నాశనం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నది.

భస్మాలు, లేహ్యాలు మొదలైన తక్కిన ఔషధాలను గురించి అది అసందర్భప్రసంగాలు చేస్తున్నది.

దారుణమైన నిబంధనలతో రిజిస్ట్రేషన్ అంటూ నిర్బంధించి ఆయుర్వేదవైద్యులను హడలగొడుతూ వున్నది.

ఏం?

కాంగ్రెసు దేశోన్నతినే కోరేదయితే ఇలాంటి అక్రమాలను అది యెందుకు ప్రోత్సహిస్తున్నదీ?

అన్ని రాష్ట్రాలను సమభావంతోటే చూసేదయితే, కాంగ్రెసు, ఈభిన్నకార్యక్రమాలకు ఏంజవాబు చెబుతుందీ?

మనవాళ్లు కొందరు, ఇదంతా రాజన్‌మంత్రి అల్లోపతివైద్య వ్యామోహమని భావించి, కష్టంగానే వున్నా సరిపుచ్చుకుని వూరుకుంటున్నారు.

అల్లోపతివైద్య నిష్ణాతులైనవారు ఆరోగ్యశాఖమంత్రి కావడం బాగాలేదని మాత్రమే అని—అసంతృప్తి ప్రకటించి ఆవిషయం చల్లచల్లగా జారవిడుస్తున్నారు.

కాని మేమీ వుద్దేశం అంగీకరించము.

ఇది భ్రాంతిమూలకమైన నిశ్చయం.

రాజన్‌గారే కాదు, కాంగ్రెసుపక్షానికి చెందిన మరే తమిళ మహాశయుడు ఆరోగ్యశాఖ మంత్రి అయినా యిది తప్పదు.

అలా కాక, యిది రాజన్‌గారి వ్యక్తిగతాభిప్రాయం మట్టుకే అయితే ప్రతీదానికీ—ప్రతీ మంత్రినీ సద్దుకుంటూ వచ్చే ప్రధాన మంత్రిగా రిప్పుడేం చేస్తున్నారూ?

ఆయుర్వేదంపట్ల యీ వైముఖ్యం తగదని వారు, రాజన్‌గారికి సలహా చెప్పరేం?

ఈతొందరపని—యీ తప్పుపని— ఈమూలచ్ఛేది ప్రయత్నం మాన్పించరేం?

ఉన్న దల్లా యేమి టంటే?

రాజన్‌గారి లాంటి తమిళులలో రాజగోపాలాచారిగారున్నా అలాంటి తమిళులే.

ఆయుర్వేదానికీ తమిళులకూ రక్తసంబంధం యేమీ లేదు.

ఆయుర్వేదవైద్యవిధానం వారికి విజాతీయం.

ఆయుర్వేదం, తమిళులకు, యునానీవైద్యవిధానం యెలాంటిదో, అల్లోపతీవైద్యవిధానం యెలాంటిదో, హోమియోపతీవైద్య విధానం యెలాంటిదో అలాంటి విజాతీయమే కాని జాతీయం యెంతమాత్రమూ కాదు.

సిద్ధవైద్యవిధానం వొక్కటే తమిళులకు స్వజాతీయం.

ఇవాళ కూడా ఆయుర్వేదవైద్యవిధానంలో చెప్పుకోతగ్గ తమిళు లెవరూ లేరు.

మద్రాసుప్రెసిడెన్సీలో, తమిళదేశానికి ఇవతలి సరిహద్దు ఆంధ్ర దేశం అంతటా ఆయుర్వేదమే. అవతలిసరిహద్దు మళయాళదేశం అంతటా కూడా ఆయుర్వేదమే. ఆపక్కసరిహద్దు కన్నడదేశం అంతటా నున్నూ ఆయుర్వేదమే.

కాని తమిళులు ఆయుర్వేదాన్ని స్వీకరించలేదు.

ఆర్యవేదమే తమిళులకు—ముఖ్యంగా అయ్యంగార్లకు పనికి వచ్చింది కాదుగదా, యిక ఆర్యుల ఆయుర్వేదం యెలా పనికి వస్తుందీ?

స్వర్గీయ పండిత, డి. గోపాలాచార్యులవారు తమ ఆయుర్వేద కళాశాలను మద్రాసులోనే నడిపినా అందులో, మన ఆంధ్రులూ, మళయాళీలూ, కన్నడులూ చేరారే గాని—లాహోరువంటి శుద్ధ వుత్తరదేశంనుంచి కూడా యెందరో విద్యార్థులు వస్తూ వుండినారు; కాని అరవలు ఆ వేపుకి తొంగిచూడలేదు.

అంటే తక్కిన పాఠశాలల్లో వుండే అరవవారి సంఖ్యలో సహ స్రాంశ మైనా ఆయుర్వేదకళాశాలలో యెప్పుడూ వుండలేదు.

అయితే, జస్టిస్సుమంత్రులు ప్రసాదించిన ఇండియన్ మెడికల్ స్కూలులో అరవవిద్యార్థు లధిక సంఖ్యాకులే, ప్రిన్సిపలు కూడా తమిళమహాశయుడే యిదేమిటీ అంటే, ఆసంస్థ ప్రభుత్వం నడుపుతున్న దని మనం మరిచిపోగూడదు.

కొన్ని తరాలు గడిచిన తరవాత మాట యేమో గాని, ఇప్పుడు దానిలో చదివి నెగ్గిన వారికి ఉద్యోగాలు సిద్ధంగానే వున్నవి కదా?

ఇక అరవలు అందులో చేరడాని కభ్యంతరం యేమిటీ?

అయితే, యీస్థితిలో ఆయుర్వేదాన్ని ద్వేషిస్తే అరవలకు నష్టం కాదా అంటే యెంతమాత్రమూ కాదు.

ఏమంటే?

రాజన్‌మంత్రి వైఖరి చూశాక ఆపాఠశాలలో తమిళవిద్యార్థుల సంఖ్య తప్పకుండా తగ్గిపోతుంది.

ఇంకెందుకూ?

ఆయుర్వేదవైద్యుల రిజిష్ట్రేషన్ విధానం, యేర్పడ్డాక రిజిష్టరీ చేయించుకున్న ఆంధ్రులు వేలమీద వున్నారనీ, తమిళులు వందలలో కూడా లేరనీ యెవ రేనా యెరుగుదురా?

ఎలా వుంటారూ?

వారిలో ఆయుర్వేదవైద్యవిధానం లేనే లేదు.

గవర్నమెంటు ఇండియన్ మెడికల్ స్కూలులో చదివిన తమిళ యువకులు మాత్రమే ఆయుర్వేదం చదివినవారు.

వారి సంఖ్య చిన్నది.

ఇక రిజిష్టరీ చేయించుకున్న తమిళుల సంఖ్య పెద్దది యెక్కణ్ణుంచి వస్తుందీ?

ఇది యిలా వుండగా:

రాజన్‌మంత్రి గారి యీఆయుర్వేదద్వేషంవల్ల తమిళులకు లేని నష్టం—గొప్పనష్టం ఆంధ్రుల కింకొకటున్నది.

మొన్న మొన్నటివరకూ ఆయుర్వేదం అభ్యసించినవా రందరూ—చికిత్సలో ప్రావీణ్యం సంపాదించుకున్నవా రందరూ సొంతంగా వాడుకోడానికే ఔషధాలు తయారుచేసుకునేవారు.

కాని అల్లోపతీవైద్యుల పద్ధతులూ, అల్లోపతీమందుల షాపులూ వారికి కొత్త రుచులనూ, కొత్త ఆశలనూ కొత్త సంకల్పాలనూ కలిగించినవి.

దాంతో, వారు, అమ్మకానికి కూడా ఔషధాలు తయారు చెయ్యసాగారు.

వీ. పీ. పద్ధతిలో ఔషధాలు దేశదేశాలకు పంపడం నేర్చుకున్నారు.

ఆంధ్రవైద్యులు మేలుకున్నతరవాత ఆయుర్వేదీయ ఔషధాల నిమిత్తం రాష్ట్రాంతరాలకు ఊరికే ధనప్రవాహం చాలావరకు తగ్గిపోయింది.

పోష్టల్ రేట్లు పెరగడంవల్ల వీ. పీ. పద్ధతి పడిపోగా, ఆంధ్ర ఆయుర్వేదవైద్యులు షోరూములు తెరవడం, బ్రాంచీలూ, ఏజన్సీలూ ఏర్పరుచుకోవడం నేర్చుకున్నారు.

దీంతో అల్లోపతీవైద్యులకు కొంత దెబ్బ తగిలింది.

అల్లోపతీమందుల షాపులకు కొంత చురుకు తగ్గిపోయింది.

ప్రజలకు ఆయుర్వేదఔషధాలు సులభంగానూ, తక్కువధరలకూ దొరకసాగాయి.

దేశోన్నతి కోరగలవారి కందరికీ యిది ఆనందం కలిగించగల విషయం.

కాని మద్రాసుకాంగ్రెస్సుమంత్రివర్గాని కిది వెగటు అయిపోయింది.

రాజన్‌మంత్రి చాలా దారుణచర్యలకు దిగిపోయాడు.

ఎప్పుడో చచ్చిపోయిన—నుసి అయిపోయిన రాష్ట్రాన్ని బతికించా లని తంటాలుపడే మంత్రివర్గం ఆయుర్వేదాన్ని యిలా దెబ్బ కొట్టడం అనుచిత మైన పని.

తమిళులు తమ సిద్ధవైద్యవిధానాని కెలాంటి సౌకర్యాలు కలిగించుకున్నా ఆయుర్వేదవైద్యులు వద్దనరు. పైగా సంతోషిస్తారు.

కాని ఇది శ్రేయస్కర మైన పని కాదు.

ఇది బుద్ధిమంతుల పని కాదు.

ఇది దేశహితం కోరేవారు చేయతగ్గది కానే కాదు.

ఇంతకీ: ఆంధ్రాయుర్వేదవైద్యులలో సంఘీభావం లేదు.

అసలు, ఆంధ్రజాతిలోనే అది లేనప్పు డందులో వొక వర్గంలో మాత్రం యెలా వుండగలుగుతుందీ ?

ఆంధ్రాయుర్వేదవైద్యులలో నాయకత్వం వహించి కాంగ్రెస్సు మంత్రుల ఈ ఆర్యవిజ్ఞానవిద్వేషం చల్లార్చగల మొనగాడు లేడు.

మన ఆంధ్రాయుర్వేదవైద్యులలో కొందరు, ఆయుర్వేదవైద్యాని కెంతో కొంత ప్రభుత్వాదరగౌరవాలు సమకూర్చిన జస్టిస్సు ప్రభుత్వాన్ని బుద్ధిపూర్వకంగా—చేతులారా పడగొట్టారు.

దాని కిది సద్యస్ఫలితం.

ఆద్రోహాని కిది శిక్ష.

మన ఆంధ్రాయుర్వేదవైద్యమండలి, తనకు తానై పూనుకొని ఆయుర్వేదానికి రాజాదరం కలిగించిన జస్టిస్సుప్రభుత్వానికి వివరాలు బోధించి మరికొన్ని సౌకర్యాలు కలిగించుకోనూ లేకపోయింది. ఇప్పు డీ ప్రళయాన్ని యెదుర్కొనూ లేకపోతున్నది.

ధిక్ !

చక్రభ్రమణంకోసం కనిపెట్టుకుని వుండడం తప్ప ఇప్పుడు చెయ్యవలసింది మరేమి వున్నదీ ?

## వంచన! వంచన!! ఘోర మైన నయవంచన!!!

అఖిలభారతకాంగ్రెస్సు వర్కింగు కమిటీ సభ్యులు సర్దార్. వల్లభాయిపటేలు, బాబూ రాజేంద్రప్రసాదు, జయరాందాస్ దౌలత్రాం, ఆచార్య కృపాలనీ, శంకరరావుదేవు, భూలాభాయి దేశాయిగార్లు ఇలా ప్రకటించారు. తరవాత, బజాజ్ గారు "నేనున్నూ డిటో ప్రకారమే" అన్నారు.

> "కాంగ్రెస్సు అధ్యక్షపదవికి డాక్టరు. పట్టాభి అన్ని విధముల తగినవా డని మా నమ్మకము. ఆయన ఎంతకాలము నుంచియో వర్కింగు కమిటీ సభ్యుడుగ నుండెను. దేశమునకు అనంత మగు సేవ నెంతకాలమునుండియో చేయుచుండెను. అందుచేత కాంగ్రెస్సు ప్రతినిధు లందరు ఆయననే యెన్నుకోవలయు నని మేము సలహా యిచ్చుచున్నాము"

నిజంగానే!

పట్టాభిసీతారామయ్యగా రంత గొప్పవారా ?

ఎప్పణ్ణుంచీ ?

వారి గొప్పతనం హఠాత్తుగా యివాళే బయలుపడిందా, లేక యీపెద్ద మనుష్యులకు ఇప్పుడే జ్ఞానోదయం అయినదా ?

తామే పట్టాభిగారిలో వున్నా యంటున్న యోగ్యతలు బోసుగారిలో లేవుగదా, మరి, బోసుగారిని నిరుడెందుకు గద్దె యెక్కించారూ ?

పట్టాభిసీతారామయ్యగారి నెందుకు వెనక్కు లాగేశారూ ?

వంచన! నయవంచన!!

అంతా ఘోర మైన నయవంచన.

ఆంధ్రజాతి కిది పరాభవం. తీవ్రమైన మర్మాఘాతం.

వీరు పట్టాభిసీతారామయ్యగారిని నిష్కారణంగా రచ్చకి లాగారు.

పులిని కొట్టడానికి మేకపిల్లను యెర చూపించినట్టు, వీరు, బోసుగారిని పడగొట్టడానికే పట్టాభిసీతారామయ్యగారిని నిలవబెట్టారు; గాని నిజంగా వారు గొప్పవా రని భావించి కాదు.

వారిని గౌరవించడానికిన్నీ కానేకాదు.

ఈమర్మం తెలవక మన ఆంధ్రులు కొందరు పొంగిపోయారు. పట్టాభిగారికి పట్టాభిషేకం అయిం దన్నవారు కూడా వున్నారు.

ఇది హాస్యాస్పద మైన సంగతి.

నిజంగా, యీపోటీ పట్టాభిగారికీ బోసుగారికీ కాదు. పటేలుగారికీ బోసుగారికీనీ.

మరీ స్పష్టంగా చెప్పాలంటే గాంధిగారికీ బోసుగారికీనీ.

ఇంకా సూక్ష్మంగా చెప్పమంటే గుజరాతీమిల్లు యజమానులకూ తక్కిన హిందూజాతులవారికీనీ.

ఇక్కడ పట్టాభిగారు నిమిత్తమాత్రులు.

మౌలానా అజద్ గారే వెనకతియ్యకుండా వుంటే ఈమహానుభావులు పట్టాభిగారిని స్మరించేనా వుండేవారు కారు.

ఎలాగేనా మౌలానాగారిని నిలిపితీరా లని గాంధిగారూ పటేలుగారూ చేసిన మంతనాల అంతర్యం గ్రహించగలవారి కిది స్పష్టమే.

అయితే, మౌలానాగారు పక్కాలౌక్యులు.

గాంధిగారు పట్టుపట్టినప్పు డెంతో బలవంతాన గాని వారందు కంగీకరించలేకపోయారు.

అంగీకరించాకయినా యెంతో బాధపడిపోయారు.

అంతరాత్మప్రబోధంవల్ల ఆపదవిని తిరస్కరించేసిందాకా వారనుభవించిన యాతన అంతా యింతా కాదు.

కారణం ?

అనారోగ్యం ఎంతమాత్రమూ కాదు.

మరేమీ కూడా కాదు.

తమ రాష్ట్రీయుడితో—తమ నగరీయుడితో—తెల్లవారితే అనుక్షణమూ కలుసుకోవలసిన పెద్దమనిషితో పోటీపడడం ధర్మం కాదని వారది విడిచిపెట్టేశారు.

మరొక ప్రశాంతపరిస్థితిలో తమ కీగారకం తక్కువకాదనే ధీమాతో కూడా వారు విడిచిపెట్టేశారు.

ఇంకొక కారణం కూడా మేము దృఢంగా నిరూపించగలం.

అది, కాంగ్రెస్సు అధ్యక్షత అంగీకరిస్తే, స్వయంగా జిన్నాగారితో— మూర్తీభవించిన ముస్లింజాతీయసంస్థతో రవ్వపడవలసివస్తుందనే సంకోచం.

“కమ్యూనల్ అవార్డు సంగతి యెత్తారంటే నేను ఈక్షణంలో కాంగ్రెస్సుని విడిచిపెట్టేస్తా” నన్న డాక్టరు. అన్సారీగారి మాట జ్ఞాపకం వున్నవారి “కిది సంభవమే” అని వేరే చెప్పనక్కర లేదు.

పోనీ, సొంత వుబలాటంతోటే మన పట్టాభిగారు బోసుగారితో పోటీకి సిద్ధపడ్డారనుకుందాం.

పట్టాభిగారు, అధ్యక్షతకు సర్వథా అర్హులే కనక అలా సిద్ధపడ్డంలో తరకాసేమీ లేదనే అనుకుందాం.

అయితే: పటేలువర్గానికి అందులో కలగజేసుకోవలసిన అవసరం యేమి వచ్చిందీ?

దేశం నాలుగు మూలలా “ఈసంవత్సరం కూడా అధ్యక్షత బోసుగారి కివ్వా” లనే సూచనలు నాలుగైదుమాసాలనుంచే ప్రతిధ్వనిస్తున్నాయి కదా?

ఇది బోసుగారి కేన్వాసింగు ఫలితం అనీ, బంగాళీల నైపుణ్యం అనీ అంగీకరించినా వా రెందుకు పోటీ చెయ్యగూడదూ?

అది తప్పయితే—అది అనవసరం అయితే—బోసుగా రందు కనర్హులయితే అసంగతి ముక్కుమీద కొట్టి ప్రతినిధులే మందలిస్తారే? వీరు కలగజేసుకోవలసిన ప్రమేయం యేమి వున్నదీ?

రెండోమాటు అధ్యక్షత కెవరూ సిద్ధపడ గూడదని యెక్కడయినా నిషేధం వున్నదా?

అసాధారణపరిస్థితులే వుండాలని అంగీకరించినా అవి ఇప్పుడు వచ్చాయనీ, రాలేదనీ చెప్పడానికి వీరికే అధికారం వున్నదా?

అధ్యక్షతతో పాటు అసాధారణమైన బాధ్యత మీద పడి—అది చక్కగా నిర్వహించుకోడానికి జటిలమైన కల్పనలు చేసుకోవలసిన అగత్యం యేర్పడి—కార్యాచరణలో వాటిలో కొన్ని మిగిలిపోవడం తటస్థపడి—ఆమిగిలిపోయినవి విడిచిపెట్టరానివనే ఆందోళన బలపడి—ఈవిధంగా అసాధారణపరిస్థితులు జతపడినట్టు అభ్యర్థి నమ్మకోగూడదా?

తక్కినవారిలో విశిష్టత యేమీ కనపడక—గతసంవత్సరపు అధ్యక్షుడిలోనే అతని ప్రతిభవల్ల ప్రత్యేకత కనిపించి అతనే మళ్లీ అధ్యక్షత వహించవలసిన అసాధారణపరిస్థితులు వచ్చాయని ప్రతినిధులు కూడా భావించుకోగూడదా?

వీరు, జవహర్‌లాల్‌గారిని రెండోమాటు ప్రతిపాదించినప్పుడు మాత్రం అలా చెయ్యకపోతే పుట్టిమునిగిపోతుం దన్నంత గండకత్తెర యేమి వచ్చిందీ?

పైగా, ఫెడరేషను విషయమై జాగ్రత్త పడవలసిన అసాధారణపరిస్థితులు వచ్చాయని బోసుగారు ఘంటాపథంగానే చెప్పారే?

కుడిపక్షంవారు ఫెడరేషను అంగీకరించడానికి సిద్ధంగా వున్నారని బోసుగారు కుండబద్దలుకొట్టినట్టే చెప్పేశారే?

అది నిజం కాకపోతే “ఇది తప్పు. ఇలా అనడం అంతకంటే తప్పు. ఫెడరేష నంగీకరించా లని మే మేకోశానా అనుకోడం లే” దని గట్టిగా జవాబు చెప్పి పటేలువర్గం వూరుకోవాలే?

అప్పుడయినా బోసుగారికి ప్రతికూలంగా ప్రచారం చెయ్యడానికి వీరికి అగత్యం లేదే?

అధికారమున్నూ లేదే?

బోసుగారిమీద పైకి చెప్పడానికి వీలులేని యేదో కసే లేకపోతే, మొదటి ప్రకటనలో తమతో కలసిన తక్కిన ఆరుగురి సమ్మతీ పుచ్చుకోకుండా—వారితో చెప్పనేనా చెప్పకుండా ప్రకటన మీద ప్రకటనా—జవాబు మీద జవాబూ, సవాలు మీద సవాలూ—పటేలుగారు అంత హైరా నయిపోడానికి వేరే కారణం కనపడదే?

దీన్నిపట్టి చూస్తే, ఫెడరేషను సందర్భంలో బోసుగారు చేసిన ప్రకటన వీరి హృదయాలు దూసుకుపోయినట్టు కనపడుతుంది. అది నిజమే అని కూడా నిశ్చయించవచ్చును.

ఈకింది సంగతులు పరిశీలిస్తే రహస్యం తెలుస్తుంది.

ఇటు కాంగ్రెస్సూ, అటు ముస్లిం లీగూ కూడా సమానంగానే ఫెడరేషన్ను తిరస్కరిస్తున్నాయి.

ఇంత పెద్ద విషయంలో ఏకాభిప్రాయం వున్నప్పుడీ పెద్ద పక్షాలు రెండూ ఇంకా విడివిడిగానే వుండిపోయాయేం?

ఇందులో వున్న భావకవిత్వం యేమిటంటే?

ఫెడరేషన్ను తిరస్కరించడంలో యేకీభావం వున్నట్టే, యీ రెండుపక్షాలకూ స్వీకరించడం తటస్థపడితే కూడా యేకీభావమే వుంటుంది.

ఇవాళ కాంగ్రెస్సు ఫెడరేషన్ను అంగీకరిస్తుందా, ముస్లింలీగున్నూ “నేనూ సిద్ధమే” అని ముందుకు వస్తుంది. “తప్పకుండా నే నంగీకరిస్తా” నని ముస్లింలీగు అంటే, “నేను మాత్రం వూరుకుంటానా?” అని కాంగ్రెస్సు ముందుకి దూకుతుంది.

ఇది బహిరంగరహస్యం.

అయితే, ఉపనాయకుల కీఅభిప్రాయాలు లేకపోవచ్చు. ఈసంగతి కూడా వారు గ్రహించలేకపోవచ్చు; కాని యిదిమాత్రం సర్వాత్మనా సత్యం.

జాతీయత అంతా నాలోనే వుందని అనుకునే—అనేకరాజకీయపక్షాలలో నొకటి మాత్రమే అయిన కాంగ్రెస్సుపక్షం ముస్లింలీగు కలిసిరాకపోతే యేమీ చెయ్యలేదు.

కాంగ్రెస్సు కలిసిరాకపోతే ముస్లింలీగు కూడా యేమీ చెయ్యలేదు.

అంచేతనే యీరెండు పక్షాలవారూ ఐకమత్యం కోరుతున్నారు.

అంచేతనే యీ యిరువాగులవారూ రాయబారాలకు పూనుకున్నారు.

కాని వున్న చిక్కల్లా యేమిటంటే ?

మస్లింలీగువారు కాంగ్రెస్సు క్రీడమీద సంతకం చేసి, కాంగ్రెస్సు జాతీయసంస్థ అని వొప్పుకున్నారంటే వారి ప్రాజాపత్యం అక్షణంలో పైస అన్నమాట.

దాంతో, ఆమస్లింలీగు సభ్యులమీద యీగాంధిగారు—అంటే యీపటేలుగారు మహానాయకులు—హైకమాండు అయిపోతారు.

కాగా, ఫెడరల్ అసెంబ్లీలో పటేలుగారే పక్షనాయకులు.

"మంత్రాంగ బాధ్యత స్వీకరించండి" అని వైస్రాయిగారు ఆహ్వానించడం పటేలుగారిని.

పటేలుగారు మస్లిములకు కొన్నీ, మన హిందువులకు (ఆంధ్రులు మాత్రం మినహా) కొన్నీ, తగుపెట్టగలిగితే, తక్కిన మైనారిటీలకు కొన్నీ "దయతో" మంత్రిపదవులు అనుగ్రహిస్తారు.

మరి మహామంత్రి ?

పటేలుగారే. ఇంకా అడగాలా ?

ఇది యిలా వుండనిద్దాం.

అటు చూసుకుంటూవద్దాం.

జిన్నాగారంటే అసామాన్యుడిగా భావించడం అవివేకం.

హిందూదేశంలో వున్న రాజనీతిపారంగతులలో వారు వుత్తమ శ్రేణికి చెందినవారు.

కొద్దిపాటి మస్లిములు మస్లింలీగులో చేరలేదేమో కాని చేరినవారంతా ఆయననే నమ్మివున్నారు.

కాంగ్రెస్సులోలాగ మస్లింలీగులో రెండుపక్షాలు లేనే లేవు.

కారణం ఆయన నిష్కల్మషహృదయం.

అయితే వారికి కాంగ్రెస్సుతో కలవడానికి ఆక్షేపణ లేదు.

కలిస్తే మాత్రం, "మస్లిముల జాతీయసంస్థ మస్లింలీగు" "హిందువుల జాతీయసంస్థ కాంగ్రెస్సు" అని కాంగ్రెస్సువారంగీకరించాలి.

ఇందులో వున్న పరమార్థం యేమిటంటే ?

"పక్షనాయకత్వం మాది"

"వైస్రాయిగారు ఆహ్వానించవలసింది నన్ను"

"ప్రధానమంత్రిని నేను"

"మంత్రిపదవులు పంచవలసినవాణ్ణి నేను"

జిన్నాగారు విధించబోయే షరతు లివి !

ధిక్ !

ఇంకెందుకూ కలవడం ?

ఉన్న గొడవంతా యిదీ.

హిందూ మస్లిమ సంభాషణలు భగ్నమయిపోడానికి—అధవా నిలిచిపోడానికి కారణం యిదీ.

ఇది సుభాసుబాబుకి తెలుసు.

మొన్న మొన్న జిన్నాగారితో ముఖాముఖిని చర్చలు సాగించింది వారే.

గాంధి పటేలుగార్ల మాటలు పుచ్చుకుని జిన్నాగారి దగ్గిరికి వెళ్ళడమూ, జిన్నాగారిమాటలు పుచ్చుకుని గాంధి పటేలుగార్ల దగ్గిరికి వెళ్ళడమూ — ఈగుంజాటనలో ఈపరమరహస్యం బోసుగారు గ్రహించేశారు.

అయితే :

హిందూముస్లిం ఐకమత్యం కూర్చడానికి రాయబారాలు సాగించడం ఫెడరేషను అంగీకరించే వుద్దేశంతోటేనా అంటే యింకా సందేహ మేం ?

అదే నిజం కాకపోతే, ఈరెండుపక్షాలూ కూడా ఫెడరేషను తిరస్కరించడానికే నిశ్చయించుకున్నారు గదా, యిక కలవక పోతే యేం ?

ఇంకొకటి కూడా వుంది.

ఫెడరేషనుకు సంబంధించిన చర్చలోనే నాలుగైదు మాసాల కిందట, ఫెడరల్ గవర్నమెంటులో ప్రధానమంత్రిపదవికి పటేలుగారు నిశ్చయింపబడ్డారనీ, అది యేకారణంవల్ల నేనా సందర్భపడకపోతే ఆపదవి భూలాబాయి దేశాయిగారికి దఖలుపరుస్తారనీ కాంగ్రెస్సు ప్రముఖుల నిశ్చయంగా బొంబాయి పత్రికలు ప్రకటించినవార్తలు, రాజకీయాలు అవగాహన చేసుకోగలవారి కందరికీ జ్ఞప్తిలోనే వుంటాయి.

రాజకోట కల్లోలాలు కొంచెం లొంగుబాటులోకి వచ్చినట్టు కనపడ్డప్పుడు "ఫెడరల్ అసెంబ్లీలో కాంగ్రెస్సువారికే మెజార్టీ రావడం నిశ్చయం" అని పటేలుగారు చేసిన సింహనాదం కూడా చెవులలో మారుమోగుతూనే వుంటుంది.

మొన్న మొన్న "ఫెడరేషన్ విషయమై మీప్రచారం వెంటనే కట్టిపెట్టండి" అని సుభాసుబాబు సత్యమూర్తిగారిని మందలించడము కూడా ఇంకా వినబడుతూనే వుంటుంది.

ఇవన్నీ కొట్టిపారేసి "గాంధిపటేలుగార్లు ఇంకా ఫెడరేషనుకు ప్రతికూలంగానే వున్నా" రంటే నమ్మి తీర్యావలసిందేనా ?

ఇన్నీ విని, యిన్నీ చూసి యింతా గ్రహించేసిన సుభాసుబాబు "కుడిపక్షంవారు ఫెడరేషను అంగీకరించడానికి సిద్ధంగావున్నా" రని ఝుమాయించి చెబితే సందేహించవలసిం దేమిటి ?

ఇదిన్నీ కాక :

మౌలానా అజద్ గారు, పట్టాభిగారిని ఎన్ను కోవలసిం దని చెప్పి వూరుకున్నారు గాని, తామున్నూ వర్కింగు కమిటీ సభ్యులే కదా, యింత గొడవ—ఇంత రగడ పెరిగినా, మరి మాట్లాడరేం ?

ఎక్కడో కొండల్లో యేకాంతవాసం చేస్తున్న జవహర్ లాల్ గారు, ఈకుడియెడమపక్షాలవారి వాదప్రతివాదాలు "పవిత్ర కాంగ్రెసు" పేగులు తోడేసే దాకా వూరుకోవడమే కాకుండా,

చివరికి కలగచేసుకున్నాక అయినా "నువ్వు బయట వుండి చెయ్యవలసింది, చెయ్యగలిగినదిన్నీ చాలా వుంది. అధ్యక్షుడ వయితే బంధకాలలో పడిపోతావు. నన్ను నేతలు పోటీచెయ్యమని ప్రోత్సహించినా అంచేతే నే నూరుకున్నా" నంటూ సుభాసుబాబుని విరమించమన్నారు; గాని "రెండో మాటు అధ్యక్షతకు నువ్వు తగ" వని నిషేధించలేదేం ?

అధ్యక్షు డయి చేసేది లేదని విరమించుకున్నారు; గాని యిప్పు డసాధారణపరిస్థితులు వచ్చే వున్నా యని జవహర్‌లాల్‌గారు గారు కూడా అంగీకరించారే ?

ఎంతసేపూ "ఇప్పుడు అధ్యక్షతకు తగినవారు మౌలానాగారే" అన్నారు; గాని ఆయన, పట్టాభిగారిని స్మరించ నైనా స్మరించలేదేం ?

మరిన్నీ,

జవహర్‌లాల్‌గారి సొంత రాష్ట్రంలోనే-ఆయన రాష్ట్రీయకాంగ్రెస్సుకమిటీకి అధ్యక్షు లవుతూవున్న సమయంలోనే—వోటింగు జరిగే చోట వారు హాజరుగా వుండగానే పట్టాభిగారికి కంటే సుభాసుబాబుకి యెనభైనాలుగు వోట్లు యెక్కువ పడ్డా రేం ?

ఎటు చూసినా వొక్క సుభాసుబాబే కాక, కాంగ్రెస్సువారిలోనే అనేకులు, కుడిపక్షంవారు—అంటే గాంధిపక్షంవారు ఫెడరేషను అంగీకరించడానికి వున్ముఖులై వున్నట్టు అనుమానిస్తున్నా రనే తేటపడుతున్నది.

ఈఅనుమానానికి బల మైన కారణం మరొకటున్నది.

గాంధిగారు, గుజరాతీబట్టలమిల్లుల అభివృద్ధినిమిత్తమే కద్దరుద్యమం ప్రారంభించా రని మేము ౧౯౩౪ సం॥ అక్టోబరు, నవంబరు సంచికలలో రుజూవుపరిచివున్నాము.

దానికి ఆధార మైన—మన పట్టాభిగారే యిచ్చిన అంకెలు :—

౧౯౨౯ సంవత్సరానికి పూర్వం, ఇంగ్లాండునుంచి, భరతఖండానికి ఏటా దిగుమతీ అవుతూ వుండిన బట్టల ఖరీదు ౫౦ కోట్లరూపాయలు. తరవాత క్రమక్రమంగా తగ్గి యిప్పుడు దిగుమతీ అవుతున్న బట్టల ఖరీదు ౬ కోట్ల రూపాయలు మాత్రమే.

భరతవర్షపు జనాభా ౩౫ కోట్లు. మనిషి ౧ కి సంవత్సరానికి సగటున కావలసిన బట్ట ౧౩న్నర గజాలు. అంటే మన భారతీయులకు సంవత్సరానికి ౪౭౦ కోట్ల గజాల బట్ట కావాలి.

ఇందులో బొంబాయి అహమ్మదాబాదు నగరాలలో వున్న గుజరాతీల మిల్లులు సంవత్సరానికి ౩౫౦ కోట్ల గజాల బట్ట తయారుచేస్తున్నవి. తతిమ్మా ౧౨౦ కోట్ల గజాలలోనూ ౨౦ కోట్లు ఇంగ్లాండునుంచీ, ౨౦ కోట్లు జపాను వగైరాలనుంచీ, దిగుమతీ అవుతున్నది. తక్కిన ౮౦ కోట్ల గజాలూ భరతఖండంలోనే చేతిమగ్గాల మీద తయా రవుతున్నది.

అంటే యేమి తేలింది ?

లాంకషైరు మాంచెష్టరు బట్టల వ్యాపారం పడిపోయినందుకు ఆంగ్లేయులు చాలా బాధపడుతున్నా రనీ, మళ్లీ యెలాగైనా అది పూర్తి చేసుకోవా లని తంటాలుపడుతున్నా రనీ మన కాంగ్రెస్సు వారు చెబుతూవుండడం అందరూ యెరుగుదురు.

దురదృష్టవశంవల్ల యిక్కడకూడా అనూత్రమే పట్టుతున్నది.

గాంధిగారు చాలా తెలివితేటలతో కద్దరుద్యమం నడిపి గుజరాతీమిల్లులను వృద్ధికి తెచ్చారు.

వాటికి మళ్లీ పతనం రాకుండా వుండాలంటే అధికారం కావాలి.

ఇంగ్లీషువారికి వ్యాపారం కోసమే సామ్రాజ్యం.

గుజరాతీలకున్ను వ్యాపారంకోసమే స్వరాజ్యం.

గాంధిగారు తమకు మాత్రం స్వరాజ్యం వచ్చినట్టు ఎన్నోమాట్లు చెప్పివున్నారు. ఆస్వరాజ్యం గుజరాతీమిల్లుల గిరాకీ గాక మరేమిటీ ?

సంవత్సరం పొడుగునా కాంగ్రెస్సుసంఘంలోనూ, కాంగ్రెస్సు వర్కింగు కమిటీలోనూ, గుజరాతీల మానసికప్రవృత్తి గమనించ గలిగిన సుభాసుబాబు కుడిపక్షం వారు ఫెడరేషను అంగీకరించడానికి సిద్ధంగా వున్నట్టు అరోపించారంటే తప్పా ?

కాగా సుభాసబాబు చేసింది ధర్మబద్ధంగానే ఉన్నది.

సీ. పీ. లో డాక్టరు ఖరేగారినీ, బొంబాయిలో నారిమెన్ గారినీ చించిచెండాడిన గాంధిగారు ఎన్నికలు ముగిసేదాకా సుభాసుబాబుని ఏమీ అనకపోవడం కూడా దీన్నే ధృవపరుస్తున్నది.

నిజంగా సుభాసుబాబు అసహాయశూరులు.

శాసనసభలలో ప్రవేశించి ౧౯౩౫ సంవత్సరం ఇండియాఆక్టును బద్దలుకొట్టేస్తా మని డాబులు చెప్పిన కాంగ్రెస్సు కుడిపక్షంవారు ఏమీ చెయ్యలేకపోయారు; గాని, ఎడమపక్షానికి—మైనారిటీలో వున్న దనుకున్న పక్షానికి చెందిన సుభాసుబాబు కాంగ్రెస్సులో ప్రవేశించి దాని గుట్టంతా బట్టబయలు చేసేశారు.

అందులో యెంత కుళ్లు పేరుకుని వున్నదో బహిరంగపరిచేశారు.

ఆదిలో నారిమెనుగారు చేసివుండవలసిన పని యిది.

డాక్టరు ఖరేగా రయినా పూనుకుని వుండవలసిన ఘనకార్యం యిది.

ఇప్పు డయినా యిది చాలా బాగుంది.

ఏతావతా :

పట్టాభిగారు మన ఆంధ్రులు.

మన ఆత్మీయులు.

ఆంధ్రేతరునితో తగువు వచ్చినప్పుడు మనవారి శక్తిసామర్థ్యాలు మనమే శంకించడం మేము సహించలేము.

మన పట్టాభిగారి తెలివితేటలు అసాధారణా లనడాని కేమీ ఆక్షేపణ కూడా లేదు.

కాని వారు మోసపోయారు.

వారు వంచించబడిపోయారు.

నిజానికి, వీరుడైనవాడికి పరాజయం కూడా వొక భూషణమే.

అయితే; వారు స్వబుద్ధితో నిలిచి, స్వభుజాబలంతో పోరాడి, స్వార్జితంగా యిప్పటికంటే తక్కువ వోట్లు తెచ్చుకున్నా అది లజ్జావహం కాకపోవును.

అలా కాకుండా, వారు, ఒకరి చేతిలో బొమ్మ అయిపోయారు.

అనాలోచితంగా అధర్మపక్షాన్ని ఆశ్రయించి, అనవసరంగా ధర్మపక్షాన్ని యెదిరించారు.

అప్రస్తుతప్రశంసలతో స్టేటుమెంటు ఇచ్చారు.

అసందర్భంగా దెబ్బతిన్నారు.

మళ్లీ ప్రయత్నించా లంటే యింతట్లో సాహసించడానికి వీలివ్వని విషమపరిస్థితులు దబ్బిచ్చి కొని తెచ్చుకున్నారు.

ఇది ఆలోచించవలసిన విషయం.

ఇది ఇంతలో మరొక ఆంధ్రుడుకూడా అధ్యక్షతకోసం ఆశించడానికి వీలులేకుండా చేసే దుస్సంఘటన.

మేము చాలా విచారిస్తున్నాము.

## కాంగ్రెస్సు చీలిపోయింది, దూరంగా వుండండి.

అయింది.

ఇక్కడికి కాంగ్రెస్సు సత్తా స్పష్ట మయిపోయింది.

అటు అంతర్జాతీయపరిస్థితులే కాదు, ఇటు భారతజాతీయపరిస్థితులున్ను విషమించేశాయి.

గాంధిపటేలుగార్లు పూర్తిగా స్వార్థపరాయణులయి వున్నారు.

ఈసంగతి తెలవని అమాయికులూ, తెలిసినా ముష్టిలో గోరుముష్టి అన్నట్టు ఆస్వార్థంలో తమకు కొంచె మయినా భాగం సంపాదించుకోవా లని కనిపెట్టుకుని వున్న అనుచరులూ వొక పక్షంగానూ,

ఉత్సాహమూ, వుద్రేకమూ, ఆశే గాని దేశపరిస్థితులు సరిచూసుకోలేని సోషలిస్టు లొకపక్షంగానూ,

తమతమ పక్షాల అభివృద్ధికోసం యిక తీవ్రప్రయత్నాలు ప్రారంభిస్తారు.

అయితే,

దేశంయొక్క భవిష్యత్తు ఈరెండురకాలవారితోటే లేదు.

అటు రోజురోజూ బలపడుతున్న ముస్లింలీగున్నది. ఇటు వొక్కకనుసన్నతో ప్రపంచప్రవృత్తిని నిమిషంలో మార్చెయ్యగల బ్రిటిషు ప్రభుత్వం వున్నది.

ఎటు చూసినా ఘర్షణలు ప్రబలడానికే సూచనలు పొటమరిస్తున్నవి.

అమాయికులూ, అస్వతంత్రులూ అయిన ప్రజల భవిష్యత్తు అంధకారబంధురంగా కనపడుతున్నది.

దీని కంతకీ కారణం గాంధిగారి కాంగ్రెస్సు.

అది చేసిన అపకారం దేశానికి మరేదీ చెయ్యలేదు.

వాస్తవంగా, ప్రజలు పెద్దపెద్ద ఆశలు కల్పించుకోగలిగారే; గాని తమ నర్వాలు కుంగిపోయి వుండడం గ్రహించుకోలేదు.

మరి ప్రకృతం.

గతంగతమే. అది యింక కలిసిరాదు.

మరి ముందుమాట ?

ఇంత రగడ జరిగాక కూడా వారింకా కాంగ్రెస్సు పెనకాలగంతులు వెయ్యవలసిం దేనా ?

ఏమి చూసుకుని ?

స్వరాజ్యం వద్దనే మూర్ఖు లెక్కడా వుండరు.

కాని రావడానికి మార్గం ?

యుద్ధం వస్తే అంతర్జాతీయపరిస్థితులు విషమించి తద్వారా మనకు కొంత లాభం కలగ వచ్చు.

ఒప్పుకుంటాము; కాని దానికి మన ప్రయోజకత్వం కాదు కారణం.

ఆలాభం నిలుపుకోగల శక్తి మన కున్నదా ?

తుపాను రేగితే తాటాకు గొడుగా రక్షించేది ?

కొంతయినా అధికారం వున్న చైనా బగ్గం పాడయిపోతున్నది.

ప్రభుత్వమే చేతిలో వున్న స్పెయిను దుమ్మూ ధూళీ అయిపోతున్నది.

ప్రపంచం ప్రపంచమే నిమిషంలో ముంచివెయ్యగల మహామహారాజ్యాలు ప్రాణాలు అరచేతబెట్టుకుని వున్నవి.

మన కేమి వున్నదీ ?

మనం "మనం" అనుకోడ మైనా యింకా నేర్చుకోలేదే ?

స్వరాజ్యం రావా లంటే దానికి ఆశేనా సాధనం ?

ఆశ లేకేనా మనకు ఆంధ్రరాష్ట్రం రాకపోయింది ?

ఉద్రేకం వద్దు.

పైకి చూస్తే లాభం లేదు. లోపలికి చూసుకోవాలి.

పరమావధి కాదు ప్రధానం దానికి, చేర్చే సాధనం.

సాధనబాహుళ్యం కాదు ముఖ్యం, దానిద్రఢిమ.

మనకి, ఇతర్లనుభవించే ఫలితాలు కాదు కోరతగ్గవి ముందు, వారి సత్తా.

కాంగ్రెస్సు అగ్గిలో పురికిస్తుంది. అంతే.

కాని అగ్నిస్తంభనం కలిగించే యోగ్యత మాత్రం దానికి లేదు.

మనకి కాంగ్రెస్సు ఆరాధ్యం కాదు.

## ఇప్పు డయినా తోచాలా, అక్కర్లేదా ?

గాంధిగారు, తమ అనుచరులను కాంగ్రెస్సులోనుంచి యివతలికి వచ్చెయ్య మంటున్నారు.

కాంగ్రెస్సుకి బయట వుండే యెక్కువ దేశసేవ చెయ్యవచ్చునన్నీ వా రంటున్నారు.

చాలా మంచిమాట.

ఇది యెందరికో తెలుసు, ఎందరో చెప్పికూడా వున్నారు.

దేశభక్తి అనేది వ్యక్తికి సంబంధించినది. అది హృదయంలో అంకితం కావలసింది.

కాంగ్రెస్సుకీ దేశభక్తికీ యేమీ సంబంధం లేదు.

ఉన్న దనుకోడం భ్రాంతి, అవివేకమున్నూ.

ఉన్న దని ఒకప్పుడు గాంధిగారనడంలో మాత్రం అర్థం వుంది.

ఏమంటే ?

కాంగ్రెస్సుని వారు చక్కగా వుపయోగించుకోగలిగారు.

అందుకోసం వారు, అప్పట్లో కాంగ్రెస్సుని అలా ప్రశంసించ వలసివచ్చింది.

కాని ఇంగ్లీషు రోజురోజూ ప్రజలకళ్లు తెరుస్తున్నది.

ప్రపంచప్రవృత్తి ప్రతీవ్యక్తికీ అది సత్యం బోధిస్తున్నది.

దీంతో కాంగ్రెస్సు గాంధిగారి చేతిలోనుంచి జారిపోయింది.

కనకనే వారు దాన్ని ఇలా సంభావిస్తున్నారు.

ఆశ్చర్యం యెందుకూ ?

వెడ్డర్‌బర్న్, దాదాభాయి, బెనర్జీ, గోక్లే, తిలక్, బెసెంటు గార్ల చేతుల్లో రంగురంగులు చూపించింది యీ కాంగ్రెస్సే కాదూ ?

వారి హయాములో అది వొక్కొక్క విధమైన ప్రవృత్తినే చూపించిందా ?

దాని స్వభావమూ, దాని ప్రవృత్తీ దాన్ని లోబరుచుకోగల వ్యక్తి యిష్టానిష్టాలను బట్టి భిన్నరూపాలు తాలుస్తూ వుంటుం దని దీన్ని బట్టి తెలవడం లేదూ ?

“జాతీయసంస్థ” అనే మాట దానికి అతకనే అతక దని స్పష్టం కావడం లేదూ ?

ఆంధ్రమహాసభను కూలగొట్టి—కుళ్లగొట్టి కాంగ్రెసువ్యామోహంలో పడిపోవడం ద్రోహం అని కాంగ్రెస్సాంధ్రుల కిప్పుడయినా తోచవద్దూ ?

## ఇలాంటి సభలు చేసేం, చెయ్యకేం ?

మా రాజమహేంద్రవరంలో జనవరి ౯ వ తేదీని తూర్పుగోదావరి జిల్లా ఆంధ్రమహాసభ జరిగిందిట.

కాని, ఆంధ్రపత్రికలో రామదాసుపంతులుగారి అధ్యక్షోపన్యాసమూ, సుధర్మపత్రికలో శ్రీ వీరఘుంటల లక్ష్మీనరసింహమూర్తిగారి ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసమూ చూసేదాకా యీ సంగతి యెవరికీ తెలవదు.

ఇద్దరో ముగ్గురో కలిసి, సొంతంగా సర్వమూ నిశ్చయించినట్టు కనపడుతుంది; కాని సక్రమంగా ఆహ్వానసంఘం ఏర్పడినట్టూ, నిర్వాహకుల నిర్ణయం జరిగినట్టూ, అధ్యక్షవరణం శాస్త్రీయంగా జరిగినట్టూ కనపడదు.

దీనికి కారకులలో వొక రని తెలిసిన శ్రీ కొమ్మేటి సత్యనారాయణగారిని అడగ్గా, దినపత్రికలు అన్నింటిలోనూ ప్రకటించా మనీ, కొన్ని వందలు వాల్‌పోస్టర్లు అతికించా మనీ, కొన్ని వేలు నోటీసులు పంచిపెట్టా మనీ చెప్పారు.

దినపత్రికలు చూడగా ౯ వ తేదీని ఆంధ్రరాష్ట్రమహాసభ జరుగుతుం దనీ, శ్రీనివాస అయ్యంగారు ప్రారంభిస్తా రనీ, రామదాసు పంతులుగారు అధ్యక్షు లనీ మాత్రమే వున్నది.

ఆంధ్రమహాసభనే ఆంధ్రరాష్ట్రమహాసభ అన్నా మన్నారు సత్యనారాయణగారు.

ఆంధ్రమహాసభకు ఎప్పుడేనా, యెవ రేనా అపేరు వాడారా ?

పోనీఅంటే, ఆహ్వానసంఘాధికం బహిరంగంగా ఏర్పరచక పోవడాని కేమి కారణమూ ?

జిల్లాలో ఏయే వూళ్లనుంచి యెంద రెంవరు-ఎవరెవరు ప్రతినిధులు వచ్చారూ ?

రామదాసుపంతులుగారిని అధ్యక్షతకు ప్రతిపాదించిన దెవరు ?

రెండేళ్ల కిందట కాకినాడలో జరిగిన ఆంధ్రమహాసభకూ వారే అధ్యక్షులు, తరవాత రెండు మూడు మాసాలకు కొత్తపల్లిలో జరిగిన ఆంధ్రమహాసభకూ వారే అధ్యక్షులు. ఇప్పుడీ (మహా) సభకూ వారే అధ్యక్షులు,

దీని ఆంతర్యం యేమిటి ?

ఏవొకరిద్దరో వ్యక్తులు ఇలాగ స్వతంత్రించడంవల్ల ఆంధ్రరాష్ట్రం వచ్చేస్తుందా ?

రాజమహేంద్రవరాని కయినా యిది ప్రశంసాకారణమా ?

తమ పేరుమీదుగా ఎలాంటి అక్రమాలు జరుగుతున్నవో యేమీ యెరగని తూర్పుగోదావరిజిల్లా మహాజనులు సత్వరాంధ్రనిర్మాణాభిలాషులై వున్నా రని నమ్మవలసిందేనా ?

## పొద్దు గుంకు తున్నది

ఈకింది అంకెలు గాంధిగారి భవిష్యత్తు నిరూపిస్తున్నాయి.

| రాష్ట్రం | బోసు | పట్టాభి |
|---|---|---|
| ౧. తమిళనాడు | ౧౧౦ | ౧౦౨ |
| ౨. ఆంధ్ర | ౨౮ | ౧౮౧ |
| ౩. ఒరిస్సా | ౪౪ | ౯౯ |
| ౪. గుజరాత్ | ౫ | ౧౦౦ |
| ౫. పంజాబు | ౧౮౨ | ౮౬ |
| ౬. బేరారు | ౧౧ | ౨౧ |
| ౭. యు. పి. | ౨౬౯ | ౧౮౫ |
| ౮. న్యూఢిల్లీ | ౧౯ | ౫ |
| ౯. సి. పి. | ౧౨ | ౧౭ |
| ౧౦. బీహార్ | ౭౦ | ౧౯౭ |

| | | |
|---|---|---|
| ౧౧. బొంబాయి | ౧౨ | ౧౪ |
| ౧౨. అస్సాం | ౩౪ | ౨౨ |
| ౧౩. మహాకోసల | ౬౭ | ౬౮ |
| ౧౪. అజ్మీర్ | ౨౦ | ౬ |
| ౧౫. మహారాష్ట్రం | ౭౭ | ౮౬ |
| ౧౬. బర్మా | ౮ | ౬ |
| ౧౭. కర్ణాటకం | ౧౦౬ | ౪౧ |
| ౧౮. సింధు | ౧౩ | ౨౧ |
| ౧౯. కేరళం | ౮౦ | ౧౮ |
| ౨౦. బెంగాల్ | ౪౦౪ | ౭౯ |
| ౨౧. సరిహద్దులు | ౧౩ | ౨౨ |
| | ౧౫౭౫ | ౧౩౭౬ |
| | ౧౩౭౬ | |
| బోసుగారి హెచ్చు— | ౧౯౯ | |

## నెల్లూరి నాటకకళాపరిషత్తు

ఈసంవత్సరం సమావేశం నెల్లూరిలో జరిగింది.

సమ్మానం చేసినవారు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి గారు.

అధ్యక్షత వహించి కార్యక్రమం నడిపినవారు మా మిత్రులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

అయిదరి సంభాషణలలోనూ విశిష్టత సాలంకారంగానే వున్నది; కాని కార్యక్రమం ప్రశంసాపాత్రంగా లేదు.

ఒకస్వామి నాటకరచననిమిత్తం పోటీ యేర్పరిచిన పరిషత్తు పాత నాటకాల ప్రదర్శనంతోటే రోజులు గడిపేసి కృతార్థత నందినది.

పరిషత్తు పద్ధతులు బాగున్నా యనడానికి మాకు మనస్కరించడం లేదు.

పరిషత్కార్యస్థానం మద్రాసులోనే స్థిరంగా వుండాలి. వార్షికసమావేశాలన్నీ మద్రాసులోనే జరుగుతూ వుండాలి. జీతా లిచ్చి నిర్వాహకుల నేర్పరచాలి. సొంతంగా కొత్తనాటకాలు రాయించి స్థానికనటులచే దిద్ది ఆడించాలి. నాటకకళకు సంబంధించిన రచనలతోనే నాట్యకళాపత్రికను నడపాలి. నటులలో అర్హపరీక్ష ప్రారంభం అయేటట్టు సన్నివేశా లేర్పరచాలి. కవులను సరీక్ష చెయ్యాలనే అహంకారం తగ్గించుకుని ఆరాధించాలనే ప్రవృత్తి పెట్టుకోవాలి. డబ్బు విలవ గుర్తించాలి. డబ్బివ్వకుండా యెవరిచేతా యేపనీ చేయించకూడదు. భరతానికి సంబంధించిన గ్రంథాలతో భాండాగారం వుండాలి.

ఈయేర్పాట్లు జరగనంతకాలమూ ఈపరిషత్తువల్ల యేమీ ప్రయోజనం కలగదు.

వార్షికసమావేశం యేటా వొక జిల్లాలో జరపాలనే పద్ధతి పూర్తిగా అనుచితమైనది.

నాటకకళలో యేభాగంతోనూ యేలాంటిసంబంధమూ లేనివారిని పరిషన్నిర్వాహకులలో చేర్చి యెగబెట్టటం గర్హించతగినదిగా వున్నది.

ప్రతిష్ఠాపకులు పరిషత్తును బాగుచేస్తే పరిషత్తు జాతిని దిద్దుతుంది. లేదూ? ఏమీ లేదు.

## హిందీ ముప్పు తెచ్చి పెడుతుంది

జవహర్ లాల్ గారు రవీంద్రనాథటాగూరుగారి శాంతినికేతనంలో హిందీభవనప్రారంభోత్సవం సాగిస్తూ, మధ్య, అసందర్భంగా హిందూదేశసామాన్యభాషాప్రస్తావం తేవడమే కాకుండా "హిందూస్థానీ రాష్ట్రీయభాషలకు హానికరముగా పరిణమించు నని తలచుట అవివేక" మని చెప్పారు.

వా రిలా చెప్పడంమాత్రం మహావివేకమా?

వారి మాతృభాష హిందూస్థానీ, వారి రాష్ట్రీయభాష కూడా హిందూస్థానీ.

హిందూస్థానీవల్ల రాష్ట్రీయభాషలకు హానిలే దని చెప్పడానికి వారికి అర్హత లేదు.

పైగా, టాగూరుగారు తమ శాంతినికేతనంలో హిందీభవనం నిర్మించడం హిందీని హిందూదేశానికి సామాన్యభాషగా చెయ్యడానికి కాదు. శాంతినికేతనంలో వివిధవిజ్ఞానసంప్రదాయాలు బోధించే పీఠాలు నెలకొల్పడం టాగూరుగారి వుద్దేశం. అక్కడ ఇదివరకే పాలీ, సంస్కృతం, టిబెటు, చీనాభాషల పఠనానికి చీనాభవనం నిర్మించబడ్డది. నైజాముగారి సాయంవల్ల ఇస్లాం, అరబ్బీ, పార్సీభాషల పఠనమున్నూ జరుగుతున్నది. కనక ఇన్నీ వుండి ప్రాచీనహిందీవిజ్ఞానబోధనమూ, భాషాపఠనమూ లేకపోతే లోటు కలుగుతుం దని భావించి, వారు కబీర్, దాదూ, తులసీదాసుల నాటి హిందీవాఙ్మయము స్థితి తెలుసుకొనుటకు ఈహిందీభవనం ప్రారంభించారు. ఇలాంటి సందర్భంలో నెహ్రూగా రిలా మాట్లాడడం మహోచితమా?

ఈ హిందీభవనాన్ని టాగూరుగారు సొంతడబ్బుతో ప్రారంభించలేదు, కొందరు దాత లిందుకు పూనుకున్నారు. ప్రోత్సాహం చేశారు.

ఇలాగే మన ఆంధ్రులుకూడా డబ్బిచ్చి ప్రోత్సహిస్తే ఆంధ్రవిజ్ఞానభాషాపఠనం నిమిత్తం టాగూరుగారు ప్రత్యేకభవనం నిర్మిస్తారు. సభ్యత కల ఏప్రాంతంవా రిలా సాయం చేసినా వారు దాన్ని చక్కగా వుపయోగించుకుంటారు.

అంతమాత్రంచేత, వారు, ఆంధ్రాది భాషలను హిందూదేశ సామాన్యభాషలుగా చెయ్యడానికి చూస్తున్నా రని పొంగిపోవలసిం దేనా? అసందర్భంగా మాట్లాడవలసిన దేనా?

"వివిధవిజ్ఞాన వాహినులు ఈ ఆశ్రమమున సంగమించునట్లు చేయుట నాగాఢవాంఛితమై యుండెను" అని టాగూరుగారు ప్రారంభంలోనే, చెప్పారు.

నెహ్రూగారికి ఇది అర్థం కాలేదు.

సంపాదకుడు

# వస్తుగుణప్రకాశిక

## గిల్టు కాలికో బైండుతో, అనుబంధములతో 1150 పేజీల గ్రంథము

ఇది సమస్త వస్తువులయొక్క గుణములను సంపూర్ణముగ తెలియజేయు నూతన గ్రంథము. ఆంధ్రవైద్య లోకమునకు, స్త్రీ పురుషులకు మిక్కిలి యుపయోగకరమగునట్లు సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యశిఖామణులు ఆయుర్వేదభూషణ, భిషగ్వర, పండిత బ్రహ్మశ్రీ వీటూరి వాసుదేవశాస్త్రి ఏ. ఎమ్. ఏ. సి. గారిచే వ్రాయబడినది. ఈ గ్రంథమునందు ఉపయోగకరమగు పెక్కు వస్తుగుణములతో 1104 పేజీలు గలవు. ఇవిగాక వివిధరోగములయొక్క ఉత్పత్తి, వాటి చికిత్సలు 50 పేజీలవరకు అనుబంధములుగా చేర్చబడి, మొత్తము గ్రంథము 1150 పేజీలను కలిగి యున్నది. వస్తువులయందలి రస, వీర్య, విపాక ప్రభావములును, వాటిస్వభావములును, గుణములును ప్రయోగములును ఈ గ్రంథమునందు చక్కగ నిరూపింపబడినవి. వస్తుప్రయోగములు వంగసేన, వాగ్భటము, చరకము, [illegible], సుశ్రుతము, భావప్రకాశిక, భైషజ్యరత్నావళి, చక్రదత్త, హారీతసంహిత, ఆర్. ఎన్. ఖోరీ మొదలైన వివిధవైద్య గ్రంథరాజములనుండి సేకరింపబడి తద్గ్రంథముల పేళ్లతో సహా పొందుపరుపబడినవి.

వైద్య సాహాయ్యమవసరము లేకయే యీ గ్రంథముండిన సామాన్య రోగములన్నిటికి బజారులలో దొరకు సాధారణ వస్తువులతో చికిత్సలు జరుపుకొనవచ్చును. ఇది ప్రతియింట నుండదగిన అమూల్య గ్రంథము.

వెల రు. **5-0-0** (పోస్టుఖర్చులు ప్రత్యేకము)

వలయువారు :—

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

అని వ్రాయవలెను

శ్రీ

వస్తుగుణప్రకాశిక మాదిరి పేజీ

చందనం :—శ్రీఖండ - మలయజ - చందన — Sandal wood - ఎరుపు, తెలుపు, పసుపు రంగులతో నిది మూడువిధములు. శ్వేతచందనము - Santalum Album రక్తచందనము - Pterocarpus Santalinus కుచందనం - Adenanthera Pavonina.

స్వభావము

చందన మొక పెద్దవృక్షము. మలయ పర్వతములయందు విస్తారముగా పెరుగును. ఇప్పు డాంధ్రదేశములో గూడా యుద్యానవనములలో నచ్చటచ్చట వేయుచున్నారు. ఆకులు కొంచెము పొడవు గలిగి చిన్నవిగా నుండును. తెల్లని పూవులు గుత్తులుగుత్తులుగా పూయును. దీనికి సంపెంగ కాయలవంటి కాయలు కూడ ఉండును. మ్రాను తెల్లగా నుండును. బాగుగా ముదిరినగాని చెట్టుకు సువాసన రాదు. మాదిరి మంచి చెట్లకు తొర్రలుండును. రక్తచందనముయొక్క ఆకులు సువ్వాకులవలె నుండును. కాయలు పగడకాయలవలె నుండును. చాల యెఱ్ఱగా నుండును. కుచందనము మిక్కిలి యెఱ్ఱగా నుండును. బట్టలకు రంగు వేయుదురు.

గుణములు

తెల్లచందనము : ఇది చేదును తీపియును గల రుచి గలిగి యుండును. మిక్కిలి చలువజేయును. ప్రియమైన సువాసన. పైత్యమును శమింపజేయును. రక్తదోషములను హరించును. వీర్యవృద్ధిని గలిగించును. అంతస్తాపమును హరించును. విషహరము. క్రిమిహరము. దప్పిని కొట్టును. మధురవిపాకము గలది. రూక్షగుణము. మిక్కిలి చల్లగా నుండును.

ఎఱ్ఱచందనము : చేదురుచి. శీతవీర్యము. రక్తపుపోటును తగ్గించును. దారుణపైత్యప్రకోపమును శమింపజేయును. నేత్రములకు హితకరమైనది. శరీరమునకు కాంతినిచ్చును.

కుచందనము : చేదురుచి. మిక్కిలి సువాసనగలది. వ్రణములను మాన్పును. ముఖరోగములకు హితకరమైనది. శీతవీర్యము మధుర విపాకము గలది.

ప్రయోగములు

పిల్లల నాభిపాకమునకు :—మంచి గంధపు చూర్ణము నాభికద్దిన మానును. మరియు పాలుగల చెట్ల పట్టచూర్ణము రుద్దినను మానును. (వంగసేన, బాలరోగాధికారము)

మశూచకమునకు :—చందనము ముద్దగా నూరి చిలుకకూర రసముతో నిచ్చిన (మశూచకము ప్రవేశించిన వెంటనే) మశూచికము ప్రసూరించకుండ నివ మించును.

మూత్రాఘాతమునకు :—తెల్లచందనము మెత్తగానూరి బియ్యపు కడుగుతో కలిపి త్రాగి, కాచి చల్లారిన పాలతో అన్నమును తినిన మూత్రాఘాతము కట్టును, మరియు రక్తముతో కూడిన యుష్ణ వాతమును గూడా కట్టును. (భావప్రకాశిక)

శుక్లనష్టమునకు :— చందనచూర్ణమును కడిమిచూర్ణమును కలిపి పాలతో ద్రావిన శుక్లనష్టము కట్టును.

ప్రదరమునకు :—చందనము వేపచెక్క కషాయముపెట్టి త్రాగిన దుర్గంధముతో గూడిన ప్రదరముకూడ కట్టును. (సుశ్రుత)

రక్తవిరేచనములకు :—మంచిగంధపుముద్ద బియ్యపుకడుగులో కలిపి అందు తేనె పంచదారయును జేర్చి త్రాగిన రక్తాతిసారము, ప్రమేహము, దప్పి, తాపమును తగ్గును.

వాంతికి :—చందనచూర్ణమును ఉసిరికరసముతో నిచ్చిన వాంతులు కట్టును.

ఎక్కిళ్లకు :—చందనపుముద్ద చనుబాలలో కలిపి నస్యము చేయించిన ఎక్కిళ్లు (హిక్కా) కట్టును. (చరకము)

రక్తపిత్తమునకు :— చందనము, వట్టివేరు, ప్రాసిపసుపు సమభాగములుగా గ్రహించి బియ్యపుకడుగులో కలిపి త్రాగిన రక్తపిత్తము తక్షణమే తగ్గును.

తెల్లకుసుములకు, సెగలకు :—చందనచూర్ణము ¼ తులం, మఱ్ఱిపాలు ¼ తులం, పంచదార ½ తులం, యిచన్నియును జేర్చి ప్రతిప్రాతః కాలమందును నేడు దినములు సేవించిన తెల్లకుసుములు సెగలు కట్టును. వీర్యవృద్ధికరము.

చందనముతో పలురకముల యోగములు కలవు. చందనాది చూర్ణము, చందనాసవము, చందనాదివటి మొదలగునవి. ఇవి బజారు వైద్యషాపులలో దొరకును. గ్రంథవిస్తరభీతిచే యోగములు వ్రాయలేదు. మరియు చందనమునుండి తీసిన తైలము మిక్కిలి పరిమళముగా నుండును. దీనివలన శిరరోగములు, చెవిపోట్లు, చిడుము మొదలగు చర్మవ్యాధులును కట్టును.


శతకములు

| | | | | |
|---|---|---|---|---|
| సుమతీ శతకము | ... | సటీక | ... | 0—2—0 |
| కృష్ణశతకము | ... | ,, | ... | 0—3—0 |
| వేమనశతకము | ... | ,, | ... | 0—3—0 |
| కుమారీశతకము | ... | ,, | ... | 0—2—0 |
| భాస్కరశతకము | ... | ,, | ... | 0—4—0 |
| దాశరథీశతకము | ... | ,, | ... | 0—4—0 |

| | | |
|---|---|---|
| రుక్మిణీకల్యాణము | సటీక | 0—6—0 |
| నీతిశాస్త్రము | ,, | 0—2—0 |
| బాలరామాయణము | ,, | 0—2—0 |
| గజేంద్రమోక్షము | ,, | 0—6—0 |
| నృసింహశతకము | ,, | 0—4—0 |
| కుచేలోపాఖ్యానము | ,, | 0—4—0 |

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము

# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి ** రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్పు అచ్చుతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్కొక్కని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అనుబంధగ్రంథములు వెలుగడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0–4–0 చందాదారులు ఒకేసారి రు 7–8–0 ను ముందుగా పంపినచో వరుసగా ఆయపుస్తకములు అన్‌రిజిస్టర్డు పార్శిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 | 26 జాగిలము | 1 8 0 | 41 ఛిన్నహస్తము (2 వ భాగము) | 1 8 0 |
| 12 చోరశిఖామణి | 1 8 0 | 27 మొగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 | 42 కంకణరహస్యము | 1 8 0 |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 | 28 సరస్వతి | 1 8 0 | 43 సంజీవి (1 వ భాగము) | 1 8 0 |
| 14 హత్యారహస్యము | 1 8 0 | 29 ఆనందాభాయి | 1 8 0 | 44 సంజీవి (2 వ భాగము) | 1 8 ( |
| 15 ఫాస్టు (1 వ భాగము) | 1 8 0 | 30 హత్యాన్వేషణము | 1 8 0 | 45 వ్రజరాణి | 1 8 0 |
| 16 ఫాస్టు (2 వ భాగము) | 1 8 0 | 31 మొగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 | 46 హత్యాభ్రమ | 1 8 0 |
| 17 కుముద్వతి | 1 8 0 | 32 గంగ | 1 8 0 | 47 కాశీఖండము | 1 8 ( |
| 18 చిన్నకోడలు | 1 8 0 | 33 మొగలాయీదర్బారు 4 భా॥ | 1 8 0 | 48 సేవాశ్రమము (1 వ భాగము) | 1 8 ( |
| 19 రహస్యభేదనము | 1 8 0 | 34 కోహినూరు | 1 8 0 | 49 సేవాశ్రమము (2 వ భాగము) | 1 8 ( |
| 20 సింహగడము | 1 8 0 | 35 అటికెన మగోలా | 1 8 0 | 50 దానీకన్య | 1 8 ( |
| 21 మణిహారము | 1 8 0 | 36 అపరిచిత | 1 8 0 | 51 స్త్రీసాహసము ప్రథమభాగము | 1 8 ( |
| 22 మొగలాయీదర్బారు 1 వ భా॥ | 1 8 0 | 37 అంతఃపురము (1 వ భాగము) | 1 8 0 | 52 స్త్రీసాహసము 2 వ భాగము | 1 8 ( |
| 23 ఘటనాచక్రము | 1 8 0 | 38 అంతఃపురము (2 వ భాగము) | 1 8 0 | 53 మేరీరాణి | 1 8 ( |
| 24 రాజసుందరి | 1 8 0 | 39 అగ్నిహారము | 1 8 0 | 54 రాజ్యలక్ష్మి | 1 8 ( |
| 25 కుంకుమభరిణి | 1 8 0 | 40 ఛిన్నహస్తము (1 వ భాగము) | 1 8 0 | 55 లీల | 1 8 ( |

## అనుబంధములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మృత్యుతరంగిణి | 0 12 0 | 10 శ్యామల | 1 0 0 | 19 కథావళి | 1 0 ( |
| 2 అభాగిని | 0 12 0 | 11 కాంతం కథలు (చిన్నకథలు) | 1 0 0 | 20 నాలుగుకథలు | 1 0 ( |
| 3 ఛద్మవేషి | 0 12 0 | 12 కాలసర్పి | 1 0 0 | 21 నీతిప్రబోధిక | 1 0 ( |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 | 13 భారతకథాసారం | 1 0 0 | 22 ఆదర్శము (1 వ భాగము) | 0 12 ( |
| 5 కాంచనమాల | 1 0 0 | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 | 23 ఉదంకుడు | 0 12 ( |
| 6 సీమంతిని | 1 0 0 | 15 అరక్షణీయ | 1 0 0 | 24 భేతాళకథలు | 0 12 ( |
| 7 సుశీల | 1 0 0 | 16 మాధవి | 1 0 0 | 25 దయ్యాలు | 0 12 ( |
| 8 శశిరేఖ | 1 0 0 | 17 లలిత | 1 0 0 | | |
| 9 యమునాబాయి | 1 0 0 | 18 పెండ్లిదండ | 1 0 0 | | |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 | 5 షాజహాను | 1 0 0 | 9 దంపతులు | 1 0 ( |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 | 6 నూర్జహాను | 1 0 0 | 10 విజయవిజయం | 1 0 ( |
| 3 మేవారుపతనము | 1 0 0 | 7 దుర్గాదాసు | 1 0 0 | 11 భక్తకుచేల | 1 0 ( |
| 4 వరమాల | 1 0 0 | 8 చంద్రగుప్త | 1 0 0 | | |

**ఈ పుస్తకాలు రాజమండ్రీ కలాభివర్ధనీ పరిషత్తులోకూడా దొరుకును**

# పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే
# తయారుచేయబడిన దివ్యౌషధములు

| | | | |
|---|---|---|---|
| 1. మకరధ్వజం. మూడువంటలు శేపికది. తులం | 12 | 0 | 0 |
| 2. వసంతకుసుమాకరం. ప్రమేహములకు | 20 | 0 | 0 |
| 3. మహాలక్ష్మీవిలాసరసం. క్షయలకు | 12 | 0 | 0 |
| 4. పూర్ణచంద్రోదయం. క్షయలకు | 12 | 0 | 0 |
| 5. భాగవృద్ధిమహాలక్ష్మీవిలాసరసం. | 8 | 0 | 0 |
| 6. సువర్ణసూర్యావర్తి. పైత్యశాంతికి | 8 | 0 | 0 |
| 7. కనకబాలసూర్యోదయం. జీర్ణజ్వరాలకు | 8 | 0 | 0 |
| 8. మహాసిందూరభూషణం. గర్భిణులకు | 8 | 0 | 0 |
| 9. మహావాతరాక్షసం. సర్వవాతాలకు | 8 | 0 | 0 |
| 10. పుటపక్వవిషమజ్వరాంతకలోహం. | 6 | 0 | 0 |
| 11. సువర్ణకాంతవల్లభరసం. | 5 | 0 | 0 |
| 12. కాంతవల్లభరసం. శోథలకు | 3 | 0 | 0 |
| 13. సువర్ణక్రవ్యాధి. అజీర్ణాలకు | 4 | 0 | 0 |
| 14. రజితచంద్రోదయం. శుక్లనష్టానికి | 3 | 0 | 0 |
| 15. వైక్రాంతచంద్రోదయం. శ్వాసకాసలకు | 3 | 0 | 0 |
| 16. బాలసూర్యోదయం. జీర్ణజ్వరాలకు | 3 | 0 | 0 |
| 17. అభ్రకపంచామృతరసం. నిశ్శక్తులకు | 3 | 0 | 0 |
| 18. వ్యాధిహరణరసం. రక్తశుద్ధికి | 3 | 0 | 0 |
| 19. రజితలోహరసాయనం. | 3 | 0 | 0 |
| 20. మహాయోగరాజగుగ్గులు. కీళ్లనొప్పులకు | 2 | 0 | 0 |
| 21. ఋతుశోధక. ఋతుశూలలకు | 2 | 4 | 0 |
| 22. షడ్గుణసిందూరం. నిశ్శక్తులకు | 2 | 0 | 0 |
| 23. రసరాట్టు. కఫవ్యాధులకు | 2 | 0 | 0 |
| 24. స్వర్ణవంగము. ప్రమేహాలకు | 2 | 0 | 0 |
| 25. వాతవిధ్వంసి. మూతికొవాతాలకు | 2 | 0 | 0 |
| 26. సిందూరభూషణం. గర్భవతులకు | 2 | 0 | 0 |
| 27. సూర్యావర్తి. ఛర్దులకు | 2 | 0 | 0 |
| 28. చంద్రప్రభావటి. మూత్రకోశవ్యాధులకు | 2 | 0 | 0 |
| 29. బృహచ్చంద్రప్రభాగుటిక. మూలశంకలకు | 2 | 0 | 0 |
| 30. నిత్యానందరసం. బోదకాళ్లకు | 2 | 0 | 0 |
| 31. క్రవ్యాదరసం. అజీర్తికి | 1 | 8 | 0 |
| 32. సన్నిపాతభైరవి. సన్నిపాతాలకు | 1 | 8 | 0 |
| 33. లక్ష్మీవిలాసం. శ్లేష్మపడిశములకు | 1 | 8 | 0 |
| 34. మహాశంఖవటి. శూలలకు | 1 | 0 | 0 |
| 35. రజఃప్రవర్తినీవటి. కష్టార్తవానికి | 2 | 0 | 0 |
| 36. వాతగజాంకుశం. 80 వాతాలకు | 0 | 12 | 0 |
| 37. జోగినీగసం. ఆమజ్వరాలకు | 0 | 12 | 0 |
| 38. విరేచనవటి. సుఖవిరేచనాలకు | 1 | 0 | 0 |
| 39. కర్పూరరసం. అతిసారాలకు | 1 | 0 | 0 |
| 40. స్వచ్ఛన్నం. చంటిపిల్లలకు | 1 | 0 | 0 |
| 41. అగ్నికుమారరసం. అజీర్తికి | 0 | 12 | 0 |
| 42. శీతాంశురసం. శీతజ్వరాలకు | 0 | 8 | 0 |
| 43. ఆనందభైరవి. జ్వరాతిసారాలకు | 0 | 8 | 0 |
| 44. కస్తూరిమాత్రలు. పిల్లలకు | 0 | 8 | 0 |
| 45. పైత్యాంతకరసం. పైత్యాలకు | 0 | 8 | 0 |
| 46. అగ్నితుండి. అజీర్తికి. అగ్నిమాంద్యానికి | 0 | 8 | 0 |
| 47. గంధర్వకళ. బలానికి లేహ్యం | తు 3 | 0 | 0 |
| 48. నాగరఖండం. అజీర్తికి లేహ్యం | 3 | 0 | 0 |
| 49. చ్యవనప్రాశం. క్షయలకు | 2 | 8 | 0 |
| 50. మహాసుగంధ్యాదిలేహ్యము | 2 | 8 | 0 |
| 51. అశ్వగంధాదిలేహ్యము | 2 | 8 | 0 |
| 52. రత్నపురుషలేహ్యము. శుక్లనష్టానికి | 2 | 8 | 0 |
| 53. మహాఖండార్ద్రకలేహ్యము. అమ్లపైత్యాలకు | 2 | 8 | 0 |
| 54. కూష్మాండలేహ్యం. రక్తపిత్తాలకు | 2 | 8 | 0 |
| 55. మేధీమోదకము. దేహపుష్టికి | 2 | 8 | 0 |
| 56. బృహత్ హరిద్రాఖండం. రక్తశుద్ధికి | 4 | 0 | 0 |
| 57. భాస్కరలవణం. అజీర్తికి | 0 | 10 | 0 |
| 58. తాళీసాదిచూర్ణము | 0 | 10 | 0 |
| 59. సితోపలాదిచూర్ణము | 0 | 15 | 0 |
| 60. హింగ్వష్టకచూర్ణము | 0 | 10 | 0 |
| 61. పుష్యానుగచూర్ణము | 0 | 10 | 0 |
| 62. అవిపత్తికరచూర్ణము | 0 | 10 | 0 |
| 63. వృద్ధగంగాధరచూర్ణము | 0 | 10 | 0 |
| 64. సుదర్శనచూర్ణము | 0 | 10 | 0 |
| 65. మహాద్రాక్షాదిచూర్ణము | 1 | 4 | 0 |
| 66. మాదీఫలరసాయనం | 0 | 10 | 0 |
| 67. జంబీరరసాయనం | 0 | 8 | 0 |
| 68. ధాతురంజని. వీర్యస్తంభనకు | 1 | 0 | 0 |
| 69. గంధర్వవసంతచూర్ణము | 0 | 4 | 0 |
| 70. చాతుర్జాతకచూర్ణము | 0 | 10 | 0 |
| 71. వాసారుద్రతైలము (రక్తశుద్ధికి) | 1 | 8 | 0 |
| 72. పిండతైలము (పగుళ్లకు) | 1 | 0 | 0 |
| 73. భృంగామలకతైలము | 0 | 10 | 0 |
| 74. నారాయణతైలము (వాతాలకు) | 1 | 0 | 0 |
| 75. చందనాదితైలము | 1 | 0 | 0 |
| 76. శ్వాసకుఠారం (దగ్గులకు) | 0 | 12 | 0 |

గంధర్వ ఫార్మసీ, మెయిన్‌రోడ్డు—రాజమండ్రి

# సరస్వతీ ఇంగ్లీషు తెలుగు పాకెట్టు డిక్షనరి

## Saraswathi English Telugu

## *Pocket Dictionary*

గ్లేజు కాగితము—665 పేజీలు—సుమారు 17000 ఇంగ్లీషుపదములకు సులభమగు తెలుగుఅర్థములు
బాల బాలికలకు మిక్కిలి యుపయోగకరము.

చక్కని గిల్టుక్యాలికో బైండు, వెల ప్రతి 1కి రు. **1-8-0**

వలయువారు—

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము

# సంపూర్ణభక్తవిజయము

54 రాజ్యలక్ష్మి
55 శీల

అచ్చులోనున్నది త్వరలో వెలువడును

రాయల్ సైజున సుమారు 800 పేజీల గ్రంథము

చిరకాలమునుండి మహాఋషుల కాటపట్టయిన మన భరతఖండమునందు అనేకమందిభక్తులు తమతపో బలమున పెక్కు దివ్యక్రియలు గావించి ఆధ్యాత్మిక విజ్ఞానమును వెదజల్లి పరమపదించిరి. భారతదేశము తపోవనము. భారతీయులు ప్రాచీనకాలమున నిట్టి పరమభక్తుల పరిచయముచే తమ యాత్మ విజ్ఞానమును పెంపొందించుకొనెడివారు. అట్టి మహాభక్తుల జీవితములు, వారి యాదర్శములు, వారిచే గావింపబడిన దివ్యచర్యలు యీగ్రంథమునందు పొందుపరుపబడినవి. ఎందరో పరమహంసలు తమ యాత్మవిజయమునందిన జీవితములతో గూడి కథలు, భగవంతుని మహిమలు, మొదలగునవి యిందువర్ణింపబడినవి. ఈగ్రంథము చిత్ర విచిత్రగాథలతో గూడి చక్కని శైలిలో జనరంజకముగా నొప్పారుచున్నది. స్త్రీ పురుషులెల్లరును చదువదగియున్నది.

వలయువారు :

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము



రాజమహేంద్రవరము : శ్రీ అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారిచే సరస్వతీ పవర్ ప్రెస్సునందు ముద్రితమై
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ప్రకటింపబడినది. [illegible]